# ఆర్తి ప్రబంధము
## ఆంధ్రానువాదము

ఉభయభాషాప్రవీణ

శ్రీమాన్ అబ్బరాజు వీరరాఘవస్వామి గారు, P.O.L.

(1900-1963)

పీఠిక, లఘుటిప్పణి :

డాక్టర్. అబ్బరాజు సీతారామచంద్రమూర్తి, Ph.D.

3-29-14/6, కృష్ణనగర్ 3/7, గుంటూరు - 522 006.

# ఆర్ష ప్రబంధము
## ఆంధ్రానువాదము

ఉభయభాషాప్రవీణ

శ్రీమాన్ అబ్బరాజు వీరరాఘవస్వామి గారు, P.O.L.

(1900-1963)

పీఠిక, లఘుటిప్పణి :


డాక్టర్. అబ్బరాజు సీతారామచంద్రమూర్తి, Ph.D.

3-29-14/6, కృష్ణనగర్ 3/7, గుంటూరు - 522 006.

చిత్రభాను
ఆశ్వయుజ పూర్ణిమ
20-10-2002

ప్రతులు : 200

మూల్యము : రు. 25/-

**అంకితము**

**శ్రీ వరదాభయ కోదండరామస్వామివారికి**

ప్రతులకు :

**డాక్టర్. అబ్బరాజు శ్రీరామదేవశర్మ,**

శ్రీధృతి హెూమియోక్లినిక్, విజయలక్ష్మీపురము, 1వవీధి
బాపట్ల - 522 101. (గుంటూరుజిల్లా)

# తప్పొప్పుల పట్టిక

| పేజి | తప్పు | ఒప్పు | పద్యము |
|---|---|---|---|
| 9 | నెల్మి | నెమ్మి | 20 |
| 10 | యత్తార | యుత్తార | 21 |
| | గుఱకవిడుచు | గుఱకలిడుచు | 21 |
| 11 | నేల | లేలు | 23 |
| | నూరు | సూరు | 24 |
| 14 | కటక్షా | కటాక్ష | 28 |
| 18 | యాళ్లార్లు | యాళ్వార్లు | 32 |
| 19 | యవిలధ | యవితధ | 34 |
| 20 | యానసింపంగ | యానతివ్వంగ | 34 |
| 21 | దానునోమగా | దాసునోమగా | 39 |
| 23 | సకలవిధసేవలు | సకలమౌసేవలు | 47 |
| | కన్నక్షింప | కన్నీక్షింప | 48 |
| 26 | యలరుననన్న | యలరునన్న | 58 |
| 35 | శ్రీయమనుదినం | శ్రీయమనుపద్రవ మనుదినం | 2 పేరా |

# కృతజ్ఞతలు

శ్రీమాన్ అబ్బరాజు వీరరాఘవస్వామివారు విశిష్టాద్వైత నిష్ణాతులు, వైశ్వదేవపరులు. నలువది సంవత్సరములు ఆంధ్రోపాధ్యాయులుగా పనిచేసి 1958లో యుద్యోగవిరమణ చేసిరి. వీరు ద్రవిడ ప్రబంధములను తెలుగు లోనికి అనువదించిరి. సంస్కృత విష్ణుపురాణమునకాంధ్రానువాదము చేసిరి. చాల సంవత్సరముల క్రిందట వీరు వీరి సోదరుడు సూర్యనారాయణ గారు (మాతండ్రిగారు) ఆదిపూడి సోదర కవులను పేరుతో మంజువాణి యను నవల, కొన్ని శతకములు వ్రాసిరి. 1963, ఆగష్టునెలలో శ్రీ వీరరాఘవస్వామి గారు పరమపదమునధిరోహించిరి.

శ్రీవీరరాఘవస్వామిగారు నాకు జ్యేష్ఠపితృవ్యులే కాక పంచ సంస్కారములు ప్రసాదించిన ఆచార్యులు. వారికి సహస్రపాదాభివందనము లర్పించుచున్నాను. వారి రచనలనచ్చొత్తించుట నామహద్భాగ్యముగా తలంచుచున్నాను.

అభిప్రాయరూపములో గ్రంథప్రాశస్త్యమును వివరించి రామానుజ దేశికేంద్రుని కరుణా సౌజన్యములకు నీరాజనము పట్టిన శ్రీమాన్ ఆచార్య ధనకుధరం సీతారామానుజాచార్యులుగారికి హృత్పూర్వక నమస్కారములు. శ్రీమాన్ వీరరాఘవస్వామి వారి గురుత్వములో విద్యార్జనచేసి. వారి కవితా రసతుంపరలనాస్వాదించి ఈగ్రంథమునకు స్పందన రూపములో తన యభిప్రాయములను వెలువరించి, తప్పొప్పులు పట్టిక తయారుచేసి యిచ్చిన మా తమ్ముడు ఆచార్య శ్రీమాన్ అబ్బరాజు శ్రీనివాసమూర్తికి నా కృతజ్ఞతా పూర్వక ఆశీస్సులు. అతిస్వల్పకాలములో గ్రంథముద్రణ గావించిన వెల్కం ప్రెస్ వారికి హృదయాభివందనములు.

భాగవతాంఘ్రిరేణువు

**డాక్టర్ ॥ అబ్బరాజు సీతారామచంద్రమూర్తి**



ఉభయభాషాప్రవీణ

శ్రీమాన్ అబ్బరాజు వీరరాఘవస్వామి గారు, P.O.L.

(1900 - 1963)

శ్లో॥ అబ్రాడ్వంశపయోధిశీత కిరణమ్, శ్రీరామసేవారతమ్ ।
శ్రీమత్ కౌశిక శ్రీనివాస కరుణా సంలబ్ధ మంత్రోత్తమమ్ ।
పాండిత్య ప్రతిభా విభాసమనఘం, శ్రీకృష్ణదాసాశ్రితమ్ ।
వందే హారిత వీరరాఘవ గురూత్తమ్, సంసుధీ పూజితమ్ ॥

# అభిప్రాయము

శ్రీరామానుజ దేశికేంద్ర ! కరుణాసింధూ ! యతీంద్రోత్తమా !
పారావార గభీర సాంద్ర హృదయా ! వ్యామోహ సంహారకా !
సారాచార విచార దక్షణ చణా ! సౌజన్యమూర్తీ ! మహా
ధీరోదాత్త గుణాలయా ! ఘనభవోత్తీర్ణా ! నమస్కారముల్.

శ్రీశైలేశ దయాపాత్రులు, ధీభక్త్యాది గుణార్ణవులు, యతీంద్ర ప్రవణులు నగు రమ్యజామాతృమునులచే తమిళ దివ్యప్రబంధముగా యనుగ్రహింపం బడిన భగవద్రామానుజగురుస్తుతి రూపమగు ఆర్తి ప్రబంధము భగవ ద్రామానుజ దర్శనమొసంగునట్టి ఒక మహత్తర మంత్ర నిక్షిప్తమగు దివ్య ప్రబంధము. అట్టి దివ్య ప్రబంధమును ఆంధ్రలోకముగూడా పరమార్థమును గ్రహించి ముక్తినొందుటకు "శ్రీయుతులు అబ్బరాజు వీరరాఘవస్వామిగారు" (1900-1963) ఆంధ్రానువాదమునుగావించి, హృద్యపద్య ప్రబంధముగా తీర్చిదిద్దిరి. ఇందు అరువది పద్యములు గలవు. అందు 1నుండి 9వ పద్యము వఱకు యతిరాజ కరుణాకటాక్ష వీక్షణ పరితాపము ; 10వ పద్యము నుండి 19వ పద్యము వరకు శ్రీరామానుజ పాదపద్మయుగళ శరణ్యము; 20వ పద్యమునుండి28 వఱకు అర్చిరాదిమార్గము -పరమపదప్రాప్తి; 29 నుండి 32వ పద్యము వఱకు కుమతావాదులయాట కట్టించిన యతీంద్రులకు మంగళము; 33 నుండి 35వ పద్యము వఱకు పరమ పదమునకై తహతహలాడుట; 36 నుండి 42 వరకు నాయజ్ఞానము పరమపదవ్యాప్తికి యాటంకము అనుట; 43 నుండి 48 వఱకు "ఈలోకమున గల హృదయాకర్షణ స్వభావములు"; 49 నుండి 51వఱకు ప్రబోధము; 52 నుండి 59 వఱకు దేహావసానకాలమున శ్రీరంగనాధ కటాక్షము; 60వ పద్యము భరన్యాసముగా అనగా సర్వభారము నీదే స్వామి యనుచు శరణాగతిని పొందుట యను మధురభక్తి భావ తరంగములతో గూడిన హృద్య పద్యములు సద్యోహృద్యములుగా సహృదయ నైవేద్యములుగా మాధ్వీక ఝురులై ప్రవహించినవి. విశేషించి ఇందలి యతీంద్ర స్తుతి

రూపమగు దండకము వజ్రదండమగు త్రిదండమును ధరియించిన భగవద్రామానుజులను దర్శింపజేయుటయేగాక, రచయితకు సైతము దండ ప్రణామములను జేయింపక మానదు. ఇట్టి దివ్య ప్రబంధమునకు మరల కారణ జన్మ్ములగు డాక్టర్ ॥ అబ్బరాజు సీతారామచంద్రమూర్తిగారు పీఠిక, లఘు టిప్పణిని యనుగ్రహించుట శ్రీవైష్ణవలోకము ఎంతయు ఋణపడి యున్నది. భగవద్రామానుజులను స్తుతించు దివ్య ప్రబంధమును చక్కని యార్తితో సేవించుటకు ఈ పీఠికయును, టిప్పణియును ఎంతో ఉపకరించును. వేయినోళ్ళు, రెండువేలనాల్కలు గలిగిన ఆదిశేషాంశ సంభూతులైన భగవద్రామానుజులను గూర్చి ఎంత పలికినను, ఎంత వివరించినను కొన్నివేల జన్మలు చాలవు. విస్తర భీతిచే పరమ భాగవతోత్తములగు వీరు ముప్పురకు నమస్సుమనస్సులనర్పించుచు

భాగవతరేణువు
సీతారామానుజాచార్యులు

ధనకుధరం సీతారామానుజాచార్యులు,
శ్రీ లక్ష్మీనారాయణ స్వామివారి దేవస్థానము,
డో.నెం. 3-29-75,
శ్రీలక్ష్మీనారాయణపురము, గుంటూరు - 6.
ఫోన్ : 91 - 0863 - 358392

# స్పందన

కర్మబద్ధుడైన జీవుడు, స్వాచార్యకృపతో, పునరావృత్తి రహితమైన పరమ పదమును జేరగోరు వేదనయే ఈ ఆర్తి ప్రబంధము. జీవుని వేదన - కవితయైనది. దుస్థితులంగుందగనీక, నేర్పుమెయి, మీశ్రీపాదముల్ జేర్పరే! నతులం జేయుదు విష్ణులోక మహితానందానుసంధాయకా !

వైకుంఠలోకానుభవప్రాప్తికి, భరన్యాసముజేసినాడు ప్రపన్నుడైన భక్తుడు. ఆచార్య స్వామి కృపయే, జగత్స్వామి చేరికకొక చక్కని నావ! వైష్ణవ సంప్రదాయమున దీనికి గల ప్రాముఖ్యమనంతము.

ఆంధ్రీకృత ఆర్తిప్రబంధము శ్రీమాన్ అబ్బరాజు వీరరాఘవ స్వాముల రచన. మూలము తమిళమున మణవాళ మామునులు సాయించిన ఆర్తి ప్రబంధస్తోత్ర గ్రంధము.

శ్రీమద్రామానుజులాదిశేషాంశసంభూతులు. కాల విపర్యయమున సంభవించిన దుర్వాదములను ఖండించి, వైష్ణవ ముద్ధరించిన జగదాచార్యులు. శ్రీరంగనాధ కృపాకటాక్షసంలబ్ధ మహాపురుషుడు. రంగనాధున కాంతరంగికస్వామి ! మణవాళురు కూడ రామానుజుల అపరావతారులని ప్రసిద్ధి. పీఠాధిపతి తిరువాయ్ మొళిపిళ్ళ (శ్రీశైలనాథుల) కడ, తమ ఆధ్యాత్మిక సంపద నభివృద్ధిజేసికొనుటకై శిష్యులైరి. గురువులకీ, శిష్యులనిన అపార వాత్సల్యము, గౌరవము. గురుస్వామి యెడల శిష్యునకత్యంత భక్తి తాత్పర్యములు. శిష్యులు స్వాచార్యులను శ్రీ వైకుంఠమునకు జేర్చుమని చేసిన ప్రార్ధనాపూర్వకమైన స్తుతికావ్యమిది.

బంగరుమేని చాయ, ఊర్ధ్వ పుండ్రాలంకృత విశాలఫాలము, జ్ఞాన రోచిస్సులెగయు నేత్రద్వయి, అనుగ్రహించుటే తప్ప నన్య మెఱుగని వాత్సల్యామృతపూరితమైన సుస్మితము, ఉభయవేదాంత శాస్త్రార్ధ పారంగతమైన వచస్సు, మేధస్సు ! గృహస్థాశ్రమమున నిట్లే, భగవద్రామానుజులుండి యుందురనెడు భావముద్దీపించు నడయాడెడు వైష్ణవతేజమే మా బాపట్ల స్వామివారు. వారే శ్రీమాన్ కొమాండూరి ఇళయవల్లి తిరువేంకట శ్రీనివాస రామానుజస్వామి ! ఆస్వామి శ్రీహస్తమే మాతండ్రి, పినతండ్రులకు పంచ సంస్కారములు జరిపి వైష్ణవ మార్గానువర్తులనుజేసినది. భావదేవుని దివ్య

క్షేత్ర స్థానాచార్యస్వామిగా, దిరుగాడిన స్వాముల దర్శన భాగ్యమందు కొనిన ఈ శ్రీనివాసుడు కూడ అదృష్టవంతుడే ! ఇట్టి అపర శ్రీమద్రామానుజులనే ఆంధ్రీకృత ఆర్తి ప్రబంధకర్త శ్రీమాన్ వీరరాఘవస్వామివారు తనకాపరమ పదమునను గ్రహించుమని (అటనట) వాచ్యముగనే తన ఆర్తిని కమనీయ కవితా రసతుందిల మొనర్చి యున్నారు. ఇందులకు, గ్రంధమున నీ క్రింది పద్యపాదములే సువిదితము.

1) వరదుడు శ్రీనివాసగురువర్యుడు చూడ గురుత్వ గర్వ విస్ఫురణ విహీనుడు. 7పేజి 12 పద్యము.

2) వరదుడు శ్రీనివాసగురువర్యుమహోత్మపదారవిందము 26పేజి 56 పద్యము.

ఇట్టి పాదములేగాక పూర్తి పద్యములో తమగురువర్యుని సాధనంబుగ గొనుమా స్వాంతమా! యని సంబోధితము చిత్తగింతురుగాక.

ఉభయవేదాంతమహోదధి శ్రీశ్రీనివాస రామానుజ స్వామివారి నిర్హేతుక కృపచేనెగడు విజ్ఞానంబు సాధనంబుగగొని స్వాంతమా!యిన్ వారెబో, భవసముత్తారకులని సదాయధ్య వసింపుమా ! యధికభక్తి సమధికనిష్ఠ స్వాచార్యాభిమానంబెయుత్తారకమనియుండు ! మనల

వడిగ రామానుజస్వామి పరమపదము<br>సేర్చగలవాడు సుమ్ము ! నిశ్చింతతోడ<br>నిర్భయమ్ముగ నుండుము ! నిదురపొమ్ము<br>గుండెపై చేయినిడి గుఱకలిడుచు (9పేజి 21 పద్యము)

పై సీసపద్యములో మొదటి పాదమును నీవిధముగా కవిగారిచ్చినట్లే

శ్రీశైలనాధులన్ - శ్రీనామమున నొప్పు తిరువాయ్ మొళిపిళ్ళ గురువరేణ్యు అని జెప్పినచో శేషాంశసంభూతుడైన శ్రీమద్రామానుజుల సాక్షాత్కారము జరుగగలదు.

ఇది యిరువురు ఆచార్యస్వాములకేక మూర్తిమత్వము దర్శింప జేయించిన రచన. కవి ఆత్మీయత, స్వాచార్యునకు - భగవద్రామానుజులకు నభేదధ్యవసాయము గల్పించినది. స్తుతిజేసిన కర్తలిర్వురు (ఆంధ్ర తమిళ ప్రబంధములు) తమస్వాచార్యుల యెడల నిశ్చల భక్తి ప్రపత్తులు. పరమ ప్రత్యయముగల దృఢ నిష్ఠులు.

శ్రీమదాంధ్ర విష్ణుపురాణము వంటి బృహత్తర కావ్యరచన నొక తపస్సుగ సాగించి, స్వాచార్య కృపావిశేషమున నపార ఆధ్యాత్మిక సంపదను బొంది విశిష్టాద్వైత మార్గానువర్తులై, వైష్ణవేష్టి వైభవేష్టి క్రతువుల నిర్వహించి, వరదాభయకోదండరామ పదపద్మారాధన నిత్యకైంకర్య జీవనులుగా ధన్యత జెందిన శ్రీవీరరాఘవస్వామి, ఆరమగ్గిన పండువంటి జీవిత చరమాంకము లో నిసర్గరమణీయమై భక్తి, భావ పరవశులై సాగించిన అక్షర తపస్సియే యీ ఆర్తిప్రబంధము.

కావ్య వస్తువాధ్యాత్మిక సంబంధమైనప్పుడు కవిత్వమునకంతగా చోటుండని స్థితి, కవికెదురగుట తప్పనిసరియైన విషయము. భక్తిభావ భరితమై, ఆత్మీయముద్రతో ఆత్మాశ్రయకావ్యమైనప్పుడు, దానిని రసమయ మొనరించుట సమర్థుడైన కవికి మాత్రమే చేతనైన కావ్యముగా ఆర్తిప్రబంధమును విడువక పఠింపజేసిన శైలీమాధుర్యము సర్వాంగీణమై యిందు భాసించినది.

ఈ కావ్యమును జదువునప్పుడు లఘుటిప్పణిలో మా అన్నగారు శ్రీమాన్ డాక్టర్. అబ్బరాజు సీతారామచంద్రమూర్తి మహోదయులు ప్రబోధముగా వివరించిన పద్యములు (49 నుండి 51 వరకు) కవిచేసిన సంబోధనలు హృద్యములు. సత్యవచస్సులు.

నరులారా ! సముపాశ్రయింపుడు వెసన్
అఘాబ్ధిలోబడిన యోసంసారులారా !

అనెడు సంబోధనలు సత్యప్రత్యయముగలయొక మహనీయుని హితవాక్యములుగా ప్రబోధములుగా సాగినవి. ఈ పద్యములను జదివినప్పుడు తెనుగు సాహిత్య పరిచయముగల సహృదయమిత్రులకు 'పింగళి - కాటూరి' కవుల సౌందరనందమను కావ్యమందుగల తథాగతుని పునరాగమన బోధలు స్ఫురించక పోవు ! సూటిగా హృదయమున హత్తుకొనగల పద్యరచన యిది. సామాన్యులగు కవులకు గానిపని ! మహాకవులకే సాధ్యమైనది. ప్రపన్నుడై భరన్యాసము జేసిన వైష్ణవ మార్గానుయాయియగు భాగవతోత్తముడు - శ్రీరంగనాథదర్శనము, అర్చిరాది మార్గమున పరమపదమున స్వాగతింపబడుట, అందలి అనుభవములు, అనుభూతులు, నిత్యసూరి వరుల సన్నిహిత సాచివ్య విశేషములన్నియు కవిగారి ఆత్మీయ ముద్రతో దర్శనభాగ్యమునను‌గ్రహించినవి. రసతుందిలమై అద్భుతకావ్యమై భాసించినది.

శ్రీమాన్ వీరరాఘవస్వామివారి ఆర్తి ప్రబంధమును, ఆంధ్రీకృత రచన వలె కాక, స్వతంత్రమైన ఆత్మశ్రయమైన భక్తి కావ్యముగా సహృదయ లోకము నానందింపజేయగలదనుటలో నెట్టి సందేహము లేదు.

ఇది విష్ణు పర తత్వమును నిరూపించిన ఆధ్యాత్మిక రచన. కావ్యముగా చదివించినది. ఇందుకు ప్రధానముగా మా అన్నగారు శ్రీమాన్ డాక్టర్. అబ్బరాజు సీతారామచంద్రమూర్తి మహోదయులకు కృతజ్ఞతా పూర్వక నమస్సులర్పించవలె ! వారీ గ్రంధమున తొలుత పీఠికను చివరలో లఘుటిప్పణిని సమకూర్చకపోయినచో పాఠకలకొకపట్టున మదికెక్కుట కష్టము. జిజ్ఞాసువులార్తిప్రబంధ భావామృతమును సేవించుటకీ పీఠిక-టిప్పణులే మార్గదర్శకములు. కవిగారేనాడో రచించి, యుపేక్షించిన ప్రాత కాగితముల నన్నింటిలో శోధించి ప్రచురణార్హతగాదీర్చి అచ్చువేయించి వైష్ణవ భక్తిలోకమున కందించిన మా అన్నగారి కృషి బహుదా ప్రశంస నీయము. వారికి మరొక్కమారు నాసుమనస్సులు !

శ్రీమాన్ వీరారాఘవస్వామివారు నాపెదపినతండ్రిగారు. అక్షరాభ్యాసము చేసిన ఆచార్యులు. వారింటనే ఆరేడు సంవత్సరములు కాలము నా విద్యార్జన సాగినది. వారి అమూల్య గ్రంధములను చదివిన నా స్పందన నీ విధముగా దెలియజేసికొను అదృష్టము గల్పించిన నాయిష్టదైవము శ్రీలక్ష్మీ నృసింహస్వామికీ, దాసుడు దాసోహములను సమర్పించుకొనుచున్నాడు.

భవదీయుడు

**అబ్బరాజు శ్రీనివాసమూర్తి**

సాహిత్య ఆచార్య :

**అబ్బరాజు శ్రీనివాసమూర్తి**, M.A., B.Ed.

విశ్రాంత ఆంధ్రోపన్యాసకులు

ఇ.నెం. 26-39-103, 10వ లైను,

చైతన్యనగర్, ఏ.టి.అగ్రహారము ఎక్స్‌టెన్షన్

గుంటూరు - 4.

శ్రీమతే రామానుజాయనమః

# పీఠిక

**శ్రీశైలేశదయాపాత్రం ! ధీభక్త్యాది గుణార్ణవమ్**
**యతీంద్రప్రవణం వందే ! రమ్యజామాతరం మునిమ్ ॥**

శ్రీశైలేశ కృపాపాత్రుడు, బుద్ధికుశలత, భక్తి, నిర్లిప్తత యాదిగా గల గుణ సముద్రుడు, రామానుజ సంప్రదాయ నిష్ఠాగరిష్ఠుడు అయిన రమ్యజామాతృమునికి ప్రణామములు అని శ్రీరంగనాథులే స్వయముగా ప్రకటించెను.

మనవాళ మహాముని, రమ్యజామాతృయోగి లేక వరవర ముని శ్రీమద్రామానుజులనంతరము. శ్రీరంగపీఠము నధిష్టించిన పూర్వాచార్యుల వరుసలో కడపటివారు. ఆదిశేషుని అవతారమైన శ్రీమద్రామానుజులే వరవరముని రూపములో జన్మించిరని నమ్మిక. వీరు శ్రీమాన్ తిరునావీరు దయ పిరాన్ దశరానర్ మరియు శ్రీరంగ నాచ్చియార్ అను పుణ్య దంపతులకు తమిళనాడందలి తిరునవ్వేలి జిల్లా తిరుక్కురుగూర్‌లో 1370వ సంవత్సరము తులామాసము (కార్తీకము - చాంద్రమాన ప్రకారము) మూల నక్షత్రమందు జననమొందిరి. ఇదియే పూజ్య నమ్మాళ్వారు (కురుగూల్ శఠకోపన్) జన్మస్థలము కావున ఆళ్వారు తిరునగరియని కూడ పిలుతురు. శ్రీరంగనాథుని భక్తుడగుటచే కుమారునకు అళగయ్ మణవాళన్ (అందమైన వరుడు) అనిపేరు పెట్టెను. బాల్యములో తండ్రియొద్దనే మణవాళన్ సంస్కృత గ్రంధములను, తమిళ దివ్య ప్రబంధమును (ఆళ్వారులకృతులు) అభ్యసించిరి.

ఆకాలములో ఉత్తమ ఉపాధ్యాయునిగా గణతికెక్కిన తిరువాయ్ మొళిపిళ్లై పీఠాధిపతిగా యుండిరి. వీరినే శ్రీశైలనాథులని గూడ పిలిచిదెరు. వీరికి నమ్మాళ్వారు యెడ భక్తి ప్రపత్తులు మెండు. అష్టాదశ రహస్యములను రచించిన శ్రీపిళ్లైలోకాచార్యుల శిష్యుడు. అష్టాదశ రహస్యములలో 1) ముముక్షుప్పాడి - మోక్షముకాంక్షించువారలు చదువ దగినది 2) తత్త్వత్రయము - విశిష్టాద్వైత సిద్ధాంతములను కుశలరీతిలో విశదీకరించునది 3) శ్రీవచన భూషణము. శ్రీవైష్ణవులకు అతిముఖ్యమగు మతపరమైన గ్రంధము అనునవి చెప్పుకోదగినవి.

అళగియమణవాళన్ తన ఆధ్యాత్మిక సంపదను పెంపొందించుకొన దలచి, శ్రీశైలేశుని దగ్గర శిష్యత్వము స్వీకరించి, ఆయన యాజ్ఞానుసారము తనయుపన్యాసములలో ద్రావిడప్రబంధ బోధనలకు సముచిత స్థానమిచ్చి ఆదరించెను. అళగియ మణవాళపెరుమాళ్ నాయనార్ నామముతో పిలువబడుచు శ్రీమద్రామానుజుని భక్తితో ఉపాసించమొదలిడెను. శ్రీశైల నాధుడు, నమ్మాళ్వారుపై తనకున్న భక్తి ప్రపత్తులకు తార్కాణముగా తిరుక్కురుగూరులో శ్రీమద్రామానుజునకు కోవెల కట్టించి ఆకోవెలాధి పత్యమును మణవాళన కొసంగెను. శ్రీమద్రామానుజులపై ప్రగాఢ భక్తిని తెలుపు ఇరువది సంస్కృత శ్లోకములతో **యతిరాజవింశతి** ని రచించి యతీంద్ర ప్రవణ యనిపేరుపొందెను.

వరవరమునులు - ఉపదేశరత్నమాల, తిరువాయ్‌మొళినూత్తందాది, ఆర్తి ప్రబంధము అను ద్రావిడ దివ్య ప్రబంధములను రచించిరి. ఉపదేశ రత్నమాల - వైష్ణవులకుపయుక్తమగు విద్యను తెలుపును. తిరువాయ్ మొళి నూత్తందాది నూరుపద్యముల నొప్పుచు, ఒక్కొక్క పద్యము ఒక దశకమునకు సమానమయి, శఠకోపుని (నమ్మాళ్వారు) సహస్రగీతి తలపుకు వచ్చునట్లు చేయును. ప్రస్తుతపఠనాంశమైన యీ ఆర్తి ప్రబందములో వరవర మునులు - శ్రీమద్రామానుజులపై స్తుతి పరం పరలను గుప్పించుచు తనను దాసునిగా స్వీకరించి శ్రీ వైకుంఠమునకు జేర్చమని స్వాచార్యుడైన తిరువాయ్‌మొళి పిళ్లెద్వారా విన్నవించుకొనును. మోక్షసాధనకై తనకున్న యర్హతను ఆర్తిప్రబంధము 55 పద్యములో ప్రస్తావించెను.

గుర్వాజ్ఞానుసారము, మణవాళనాయనార్ శ్రీరంగములో స్థిరపడి వైష్ణవ ఆళ్వార్ల, ఆచార్యుల బోధనలను విస్తరింపజేసి విశిష్టాద్వైతమును, శ్రీవైష్ణవులనుజ్జీవింపజేసిరి. తదుపరి శ్రీరంగములో సన్యాసాశ్రమము స్వీకరించి శ్రీరంగనాధుని యాదేశానుసారము మణవాళమహాముని అను నామము స్వీకరించి శ్రీశైలేశ మహామంటపమును నిర్మించి తనబోధనా వ్యాసంగమును వృద్ధి చేసిరి. భగవద్విషయమై దీర్ఘోపన్యాసములను ఒక సంవత్సరకాలము తన సమక్షములో కావించిన పిమ్మట మణవాళ మహామునిని ప్రశంచించుచూ శ్రీరంగనాధుడు బాలుడుగా దర్శన మొసంగి, జీయరుపై గురుభావముట్టిపడునట్లు శ్రీశైలేశదయాపాత్రమ్.... అను శ్లోకమును పఠించెను. మణవాళమహాముని బుద్ధి కుశలతను,

ఆయనపై గౌరవప్రతిష్ఠలను దెలియజేయు ఈ శ్లోకమును ప్రతి శ్రీవైష్ణవాలయమందు, గృహమందు అవశ్యము పఠింతురు.

తిరుమల శ్రీవెంకటేశ్వరునిపై ప్రతివాది భయంకర అణ్ణన్ రచించిన శ్లోక పరంపరలో (శ్రీవెంకటేశ్వరసుప్రభాతము ఈవిధముగా యున్నది.)

**శ్రీమత్సుందరజామాతృమునిమానసవాసినే**
**సర్వలోక నివాసాయ శ్రీనివాసాయమంగళమ్.**

భక్తుల హృదయములందు, ప్రత్యేకముగా సుందరజామాతృముని (వర వరముని, మణవాళమహాముని) యందు భగవానుడు సుఖ సంతోషములతో వసించును.

శ్రీమద్రామానుజుని కాలమునుండి యమలులోయున్న దేవాలయ పూజా విధానమునకు, ముస్లిందండయాత్ర వలన కలిగిన దుష్ఫలితాల మూలముగా (ఆచారకర్మలకు భంగము వాటిల్లుట, దైవభక్తికల సాధువులను సంహరించుట, దైవదూషణ) భంగమేర్పడెను. కొంత కాలము తదుపరి శ్రీరంగములో శాంతి నెలకొనెను. అప్పుడు పీఠాధిపతిగా యున్న మణవాళ మహామునులు రామానుజ మతానుసారము, పూజా విధానమును క్రమ పద్ధతిలో సంస్కరించి 'రామానుజాచార్య దివ్యాజ్ఞా వర్ధతాం అభివర్ధతాం' అను మూలసూత్రమును ప్రతిపాదించి, దానికి బద్ధులై పూజా విధానమును తిరిగి వెలుగులోనికి తెచ్చిరి. శ్రీవైష్ణవమత సిద్ధాంత వ్యాప్తికై శ్రీమద్రామానుజులచే నియమింపబడిన డెబ్బది నాలుగు పీఠాధిపతుల వంశస్థులలో కొందఱు ప్రముఖులు - ప్రతివాది భయంకర మణ్ణన్, ఎఱుమ్బిఅప్పా మొదలగు వారు మణవాళ మహామునికి శిష్యులై ప్రీతిపాత్రులైరి. ఇదియే మణవాళమహామునుల విశిష్టమైన తీవ్రతర బుద్ధికుశలతకు ప్రతీక.

**యతీంద్ర ప్రవణ ప్రాభవము :** ఒకప్పుడు ఉత్తరాది (వింధ్యకు ఉత్తరదేశము) వైష్ణవుడు మణవాళ మహామునికి వ్రాయుచు శాస్త్రముల సారమేమి? కైవల్య ప్రాప్తికి ఏమి చేయవలె ? అని సలహా కొఱకై వారిని ప్రార్థించెను.

భగవత్సంబంధము గ్రహించుటకాని, నిత్యము భగవదారాధన వలన కాని, ఆచార్యుని ఆజ్ఞలను తిరుగులేక పాటించుట వలన కాని, భాగవతాభిమానముచే గాని వైకుంఠప్రాప్తి కలుగదు. నిత్య తిరువారాధన చేయుచు, ఏ శ్రీవైష్ణవుడైనను మరొకరింట్లో స్వేచ్ఛగా, నిస్సందేహముగా, నిర్భయముగా

సంచరించుటకాస్కారముండవలె. ఇది లభ్యముకాకున్న జ్ఞానానుష్ఠాన భగవద్రహస్య చర్చలన్నియు బూటకములని భావింపవలెను. అనగా శ్రీవైష్ణవుడు అహంకార మమకారములను జయించి, ఇతర శ్రీవైష్ణవులపై అభిమానము ప్రదర్శించుటేకాక, వారిని తన నాయకునిగా పరిగణింపవలె.

మణవాళమహాముని శిష్యులిద్దఱు, పిళ్లైలోకాచార్య విరచిత శ్రీవచన భూషణమును తమగురువు కృపాకటాక్షముల ద్వారా అభ్యసించుచు, తరచు తమలో తాము కలహించుచుండిరి. జియ్యరుగారికిది బాధా కరముగా యుండెను. ఒకసారి గురుశిష్యులు కోవెలనుండి తిరిగి వచ్చు చుండగా రెండు శునకముల అఱుపులు తీవ్రరూపము దాల్చుట గమనించి, శిష్యులకు వినబడునట్లు నెమ్మదిగా శ్రీవచనభూషణమును ఘనముగా అధ్యయనము చేయుట కాబోలు వీటి అఱుపులకు ప్రబలకారణము అని వచించెను. అదృష్టవశాత్తు శిష్యులకలహములకు తెరపడినది.

పరిపక్వ వృద్ధాప్యదశలో మణవాళమహాముని స్వయముగా ఘంటము చేతబట్టి తాళపత్రములపై ఆచార్యహృదయము అను ప్రబంధము నకు వ్యాఖ్య శరరీభాధను సహించి వ్రాయుచుండెను. వారిశిష్యులు శ్రీకందా డైఅణ్ణన్ మీరు ఎందుకు ఈ వయస్సులో కష్టపడివ్రాయుచున్నారు అని అడుగగా దానికి గురువు నీపుత్రపౌత్రులందఱకు, పూర్వాచార్యులు వదలిన ఈ నిధి లాభింపవలెనని నా ఆశయము అని సమాధానమిచ్చెను. ఆయన మానవతావాది. మానవజాతి మనుగడకు ఆధ్యాత్మిక చింతనయే శ్రేయమని వారిధ్యేయము. వారు 1443లో పరమపదము నధిరోహించిరి. శ్రీమణవాళమహామునీంద్రా ! మీతేజస్సు మరొక శతాబ్ది వరకు ప్రకాశించుగాక.

**శ్రీమతేరమ్యజామాతృ మునీంద్రాయ మహాత్మనే**
**శ్రీరంగ వాసినే భూయాత్ నిత్యశ్రీ నిత్యమంగళమ్.**

భగవద్భాగవత చరణదాసులైన మీకు నిత్యమంగళము కలుగుగాక అని దాసుని ప్రార్థన.

---

Source : Articles in english by Dr. V.V. Ramanujam - Retired Professor - Published in Sri Manavala Mamunigal sixth Birth centenary commemoration volume Sri Manavala Mamunigal kainkarya sabha, Triplicane - Chennai - 600 006.

శ్రీమతే రామానుజాయ నమః

# ఆర్తిప్రబంధము

శ్రీమణవాళమహామునులు ఎంబేరుమానార్ విషయమున
బ్రసాదించిన ద్రవిడ ప్రబంధమున కనువాదము.

1. శ్రీరుచిర ప్రపత్తి యతి-శేఖర ! మంగళమంబెవారు ము
మ్మారు వచింత్రువారలకు - మంగళమున్ వచియించువారికిన్
గూరిమి మంగళంబనెడు - కోవిదకోటికి మ్రొక్కువారికిం
బేరిమి గౌరవంబులిడి - వేడ్క భజింతురు నిత్యసూరులున్.

2. ఆనతశీర్షులై యమల - మైనమనంబుల భక్తిగల్గి రా
మానుజ పాదపద్మముల - కర్మిలిమ్రొక్కగనేరనట్టి దు
ర్మానవుతోడి చెల్మి నొక - మాత్రముసైపని ధన్యజీవులన్
మానుగ గొల్చువాని బుధమాన్యులు సూరులు మెత్తురెప్పుడున్.

3. తల్లియుదండ్రియున్ సుతులు - దారయు మున్నగు సర్వసంపదల్
తెల్లముగాగ దాసునకు - దేవరవారెయదార్థమిట్లుగా
జెల్లరెయట్టి నిష్ఠకును - జేటొనరించెడి యీశరీరమున్
సల్లలిత ప్రభావయతి - చంద్ర ! విచారణమేలసేయవో.

4. ఒక చెరసాల యీతనువు - నొయ్యదొలంగి క్రమించి యర్చిరా
ద్య కలుషితాధ్వముం గనుచు - దధ్యము నిత్యమహావిభూతి జెం
దు కలిమి యెప్పుడో, దురిత - దూర, కృపాళుయతీంద్రదానర
క్షకుడవు భారమూనితివి-గా ; కరుణింపు నమస్కరించెదన్.

5. తనసుతుడొద్దలేనియెడ - దం(డ్రి సుఖానుభవంబు సమ్మతిం
చునె యతిరాజ, దేవరకు, సూనుడు దాసుడుగాడె వీనికా
దని సుఖియింపనేరుతువె - యద్దియసాధ్యముగాన వేగ, దా
సుని గృపసన్నిధిన్నిలుప - జూడగదయ్య నమస్కరించెదన్.

6. ముదురు కొలందివేమునకు - బూర్తిగ జేదులగించునట్లు ని
త్యదురిత కర్మరుండయిన - దాసుని దౌష్ట్యముతోడ దేహ వృ
ద్ధిదగు, స్వరూప సత్తగని - దేహమువాయునుపాయమెంచి వే
గ దయితనేలకొమ్ము యతి - సత్తమ ! దేవ ! నమస్కరించెదన్.

7. తన చనుడ్రావుబాలునకు - దార్కొను వ్యాధికి దల్లిమందులం
దిని రుజబాపుటబ్బురమె - దేవర వారికి బిడ్డడైన దా
సున కయి సర్వముంజలుప - జొచ్చుట కీర్తికి హానిగాదు, కా
వున యతి సార్వభౌమ కృప - బ్రోవగదయ్య నమస్కరించెదన్.

8. బిడ్డడు బావియొద్దునకు - బేరెము వాఱి నుపేక్షసేయ నా
బిడ్డనికైన దుస్థితికి - బెద్దయు దూఱువడున్ జనిత్రి, నే
జడ్డుదనాన బాపినయి - చాకనుపేక్ష యొనర్తువెంచుమే
ర్పడ్డది బాంధవంబుయతి - రాజ బిడౌజ నమస్కరించెదన్.

9. కూపములోన బిడ్డసుతు - కోసము దూకి సముద్ధరించి సం
తాపము వాపు తల్లివలె - దాసుడు ఘోరదురంత దుఃఖకృ
త్పాప భవంబులంబడగ - వైళమతామవతారమెత్తి ర
క్షాపరతంత్రులయ్యెదరు - గా యతిరాజ నమస్కరించెదన్.

10. శ్రీరంగేశ్వర దివ్యపాదుకలునై - శ్రేయశ్శుభాకారులౌ
మాఱన్ సంయమ దివ్యపాదుకలునై - మాతంఘ్రియున్ దేవుడై
సారంబైన స్వరూప సత్తకునుదం - చద్దేతుభూతుండునౌ
శ్రీరామానుజపాదముల్ గొలిచియు-జ్జీవింపమాచిత్తమా !

11. అనయంబున్ భవదీయపాదపరిచ - ర్యాభంగభీతాత్ముడై
వనజాతేక్షణదర్శనాదికములన్ - వర్జించియై కాంత్యల
బ్ధినిమున్ గొల్చునతార్యుడౌవడుగనం - బింబోలెగైకొంచు త్వ
ద్ఘన కైంకర్యరసానుభూతి యిడి ర - క్షంజల్పురామానుజా.

*12. వరదుడు శ్రీనివాసగురు-వర్యుడు చూడగురుత్వగర్వ వి
స్ఫురణ విహీనుడీజడుడు - పొందుత ధన్యత నంచునన్ను ద్వ
చ్చరణ సరోజయుగ్మ పరి-చారకుగానొసగెన్ గ్రహించి తా
తెఱగది తప్పనీయకు య-తిప్రవరా ! కరుణాకరాగురూ !

13. శ్రీరామానుజ పాదపద్మయుగళీ-సేవారసాస్వాదులౌ
వారల్ మంగళమంచు మూడుపరులున్ - భాషింతురాపుణ్య వి
స్తారాంఘ్రిద్వయి నాశ్రయించుఘనులన్ - సౌజన్యసంశీలురా
ళ్వారుల్ సత్కరుణాకటాక్షరుచులం - బాలింతురే వేళలన్.

14. ఘనవిజ్ఞాన గుణక్రియాదికమునే - కాంక్షించి రక్షించు శ్రీ
వనజాతాక్షుడు నీవాలెక్కగొనవా - వర్గంబులెక్కింప జూ
చిననే మున్నదియస్మదాదులకు ను-జ్జీవింప మార్గంబు స
జ్జనతా వందిత పాదపద్మయతిరా - జా,చేతనోద్ధారకా !

* (పరమదయాపయోధి తిరువాయ్‌మొళిపిళ్ల గురుత్వగర్వవి)

15. ఊనకలోనప్రేమమిటు - లూరకనాలుకతోవచింతు, రా
మానుజపాదముల్ శరణ-మంచు నిజంబుగ నీకుమెప్పుదే
జానగుకార్యమొక్కటియు-జల్పను జల్పగ బోను ముందు
నజ్ఞాన ఘనుండ నీచర-ణ సన్నిధి, జేర్పుట యెప్డుసంయమీ.

16. ఎఱుగుదు బుద్ధికానిపని - యెయ్యదొయన్యులజేరిచక్కగా
గఱుపుదుగాని కానిపని - గట్టిగ జేయుచు నుంటి పాపినై
కఱదలుసేతలున్ గలియ - గాగలవెప్పుడు కావు కాన త్వ
చ్చరణ సరోజసన్నిధికి - దాసునిజేర్పుట యెప్డు సంయమీ.

17. పరమదురంతదుష్కృతుల - పాతఱలై సుకృతంబులేశముం
బరగని ఘోరపాతక స - మాజమునైనను శంకలేకనే
పరమపదంబు జేరునని - పల్కితి, కన్నకుమారునేలగా
జరుపుడు కాలమెంతయును - సంయమి సత్తమ తెల్పుమేలకో.

18. జగతిన్ సంస్కృతికాళరాత్రి ప్రబలా-జ్ఞానాంధకారంబుగ
పృగుదించున్ బ్రధితాత్మరూపమున నీపుణ్యాబ్ధి సందర్శన
స్థగితార్కోదయమట్టె దాని జెఱచున్ - సత్యప్రతీకారకా
ర్యగ వేషామతి యొండులేదెపుడుదీ - పృద్దివ్య కారుణ్యా దృ
ష్టిగటాక్షింతువభాష్య కార! యతిరా-డ్దేసేంద్ర ! రామానుజా !

19. ఎందనుకీ శరీరమున - కీగతి నక్కట ! కింకరుండనై
యుందునుపేక్షసేత భవ - దున్నతి కింపెను జేటుదెచ్చు ధీ
వందితవర్తనుండు సుగుణప్రథుడౌ జనకుండు కన్నపు
త్రుందగ నీచసేవలకు రోయక పంచి సహించునే ప్రభూ !

20. పరమపదమునకు - నరుగు తెరవుగూర్చు
నను మహానందంబు - ననుభవించి
అర్చిరాదిపథంబు - ననుగమించియమృత
విరజాస్రవంతిలో - వేడ్కమునిగి
తాపత్రయవ్యథల్ - తలగిప్రాకృతమల
ములనన్నిటిశిథిల - ములనొనర్చి
పరిశుద్ధమైన న-ప్పరమపదముడాసి
స్వస్వరూపగుణపు - చయము మెఱసి
శుద్ధసత్త్వమయంబు - సుందరాప్రాకృత
దివ్యదేహప్రాప్తి - దెలివిగాంచి
నిత్యసూరులెదురై - నెల్మిబ్రహ్మాలంకృ
తులచేనలంకార -ముల ఘటించి
సత్కరింపవారల గూడి-సవినయమున
దివ్యనవరత్నఖచితమం-దిరముసొఱగ
నాశ్రియఃపతితనయొడి - యందు జేర్చి
శిరము మూర్కొని గాఢసం - శ్లేషమొసగు
సంపద యెయతిరాజులొ - సంగునదియ.

*21. ఉభయవేదాంతమ-హోదధిశ్రీ శ్రీని
వాసరామానుజ - స్వామివారి
నిర్హేతుక కృపచే - నెగడు విజ్ఞానంబు
సాధనంబుగగొని - స్వాంతమయిక
వారెబోభవసము - త్తారకులని సదా
యధ్యవసింపుమా - యధికభక్తి

* 21 (శ్రీశైలనాధులన్ - శ్రీనామముననొప్పు తిరువాయ్‌మొళ్లి పిళ్ల-గురువరేణ్యు)

సమధికనిష్ఠస్వా-చార్యాభిమానంబె
యత్తారకంబని -యుండుమనల
వడిగ రామానుజస్వామి - పరమపదము
సేర్పగలవాడు సుమ్మని - శ్చింతతోడ
నిర్భయముగనుండుము నిదురపొమ్మ
గుండెపై చేయినిడికొని - గుఱకవిడుచు.

22. శమదమాదకముఖ్య - సద్గుణసహితుండు
ద్రవిడవేదవిషయ-ప్రవణుడైన
*శ్రీ వాసగురుదేవు - కృపయె దొరకిన రా
మానుజ దేవాభి-మానమనగ
గామాదికానేక - కల్మష ధ్వంసియౌ
శ్రీవైష్ణవంబను - నావయెక్కి
ఘోరాతిఘోర సం-సారవారాకర
మవలీల దాటి - యత్యంతరక్తి
అఖిల కళ్యాణగుణముల - కాలయమగు
పరమపదనాథుశ్రీదివ్య - పాదములను
నవలి గట్టుజేరి సుఖింతు - హాయి ! హాయి !
ఏమి భయమింక నాకునూ - హింపనేల.

23. అప్రాకృత మణిచ-యాభిశోభితమైన
యానందమంటపా-భ్యంతరమున
నిరతిశయద్యుతి - నిష్ఠితుతానిత్య
సూరులు ముక్తులు - సూరెలెందు

* 22 (తిరువాయిమొళిపిళ్ల కరుణదొరకిన

కొలువుదీఱిచియుండ - గొమరారుశయ్యయౌ
ఫణిఫణగణకాంతి-వలయమందు
స్థిరసౌకుమార్యసుం-దరతాభిమందిర
యిందిరకుడివంక - నెలిమిగులుక
అనుపమతారుణ్య - ఖనులు భూనీళలు
వామభాగంబున-బరిఢవింప
నడుమముమ్మెఱుపుల తోడి - నవపయోద
మనగరవణిల్లియుభయరా-జ్యంబునేలు
ప్రథితనారాయణచరణ - ప్రాప్తిఫలము
దేవయతిరాజవేప్రసా-దింపవయ్య !

24. స్థూలదేహమువాసి-సూర్యమండలమెక్కి
బ్రహ్మాండముక్రమించి-పైనదనరు
సప్తావరణముల - జయ్యనలంఘించి
మితిలేనిమూలప్ర-కృతిని మీఱి
రమణీయ విరజాత - రంగిణిలోనాడి
సన్నుతామానవ - స్పర్శవలన
విమలతేజోరూప - విగ్రహశ్రీనొంది
నిత్యసూరులెదురై - నెమ్మితోడ
పరమేశ్వరార్హరు-చిర భూషణముసేసి
కొనియాడి, తోకొని చనగనేగి
వైకుంఠనగరంబు - వడిగ బ్రవేశించి
మణిదీప్తమంటప - మధ్యమందు
స్వామిదాసులు దాసుని-స్వాములైన
సూరివర సమాజంబులో - జేరుదినము

దాసునకు సమీపించు వి-ధంబనుగ్ర
హింపగృపసేయుమయ్య తం-డ్రీ యతీంద్ర.

25. నిర్వ్యాజకారుణ్య - నిష్ఠితాత్మలయియే
నాడుదాసుగని నా-వాడటంచు
నభిమాన పడియన-న్యార్హశేషత్వవ
ర్తనసాగటాలించి - రాదినము మొదలు
ప్రాక్తనవాసనా-బలముచే నపరాధ
శతముల విడువక - చలుపుచౌకట
నీను తప్తమతినా - కనపరాధిగాగని
దేవరవారి బ్రా-ర్థించుదాసు
దోసంబులెఱిగియు - ద్రోసిపుచ్చకసదా
శ్రీపాదదాస్యంబు - స్వీకరించి
యేలుటలుగాక తిరునాడు - కృపయొనర్ప
దలచుచున్నారలెంతయు - దారమతులా !
యిపుడె పరమపదమనుగ్ర-హింపరయ్య
దేవదేవ! రామానుజ - దేశికేంద్ర.

26. పరికింపన్ భుజగేంద్ర శాయియనుద - త్పద్మాదికాంతామణుల్
వరసేనాధిపముఖ్యసూరులునుశ-శ్వత్కీర్తులాళ్వారులున్
మఱినాథాదిగురుల్ సహింపగలరే - నాదోసముల్ నీవెగా
క రహిన్ బ్రాప్యరుచిన్ ఘటించినముపీ-కంజేర్పు వైకుంఠమున్.

27. చిత్తమ యొకమాట - చెప్పెదనీ జగ
ద్వస్తువు నెద్దాని - దలపవలదు

ఎంబరు మానారు - లిలమీదకృపసేయు న
ప్పరమవ్యోమ - మందుదనరు
దివ్యలోకంబందు దే - దీప్యమానమౌ
సింహాసనంబందు - శ్రీవిభుండు
కొలువుదీర్చునునికి - నెలకులనిత్యసూ
రులలంకరించిన - రూపుసొంపు
అవ్వారు పడయు మ - హానందరసనంబు
దానిగోల్పోయిన - దైన్యచరిత
క్రమ్మఱబడయంగ - బ్రతిబంధమైనశ
రీరావసానని - రీక్షణంబు
నట్టి దేహపరిత్యాగమైన వెనుక
గలుగు నిరతిశయానంద - కలితసుఖము
ఎడతెఱిపి లేకరేబవ-ళ్లలమితోడ
సలలితాను సంధానంబు - జలుపవలయు.

28. సకలచేతన సమాజము - సముజ్జీవింప
వలయునను కరుణా-కలితమతుల
నైకకంఠ్యముగ బూర్వాచార్యులుంబ్రసా
దించిన శ్రీకోశా-సంచయముల
బ్రాప్తంబులే వాని - వ్రాసిదేశికముఖ
మున జక్కనభ్యాసమునుబొనర్చి
బుధులకు నయ్యవి-బోధించు పనిగొని
కాలమింతటిదాక - గడుపుచుంటి
శ్రీరమాకాంతుడే - నారాయణుండు
పరమపదముమాట - వరుసమఱచి

యీ విభూతినివాస - మిచ్ఛించియుంటి

దిగంతవిశ్రాంతికీ-ర్త్యంచితుడగు

శ్రీయతీంద్ర దయార్ద్రల-క్ష్మీ కటాక్షా

భాగ్య సంప్రాప్తి జేసి యిప్పట్టునందు

బరమపదమొందు దక్కనా - భావమందు

నన్యయేదియు భాసింప - దహరహంబు.

( పొట్టకు బట్టకున్శ్రమము - బొందుచు బూర్వభవప్రయుక్తమై

పట్టిన పుణ్యలేశమున - బట్టితి సద్గురు పాదపద్మముల్

గట్టుచుగ్రంథముల్ మనము - కల్మషదూరముగా సమర్చలన్

నెట్టెటొ కాలమున్గడిపి - యిప్డుయతీంద్ర కృపాప్రలబ్ధమై

నెట్టన శ్రీవికుంఠభువ - నిత్యనివాసమహాభికాంక్షలన్

గట్టిగబట్టి యన్యమును - గాదని కాలము వేచియుండితిన్. )

## దండకము :

29. ప్రత్యక్షమేకం ప్రమాణంబు వొమ్మంచు నాస్తిక్యమార్గానుగంబైన చార్వాక సంజ్ఞాక కార్పాస్తరాసిన్ స్వసూక్త్యగ్నికీలంబులన్ బూది గావించి, జైనావనీ జాతవారంబు వాగింపదావంబునైచూ, శాక్యార్ణ, వాంఛస్సులన్ పొన్మ యూఖాళినింకించి, పెల్లుబ్బి తబ్బిబ్బునై హేయమై బుద్ధిమాంద్యప్రధానంబు నే యన్నిరీశాభిధానంబు సాంఖ్యా వనీధ్రంబు సిద్ధాంతవజ్రప్రఘాత ప్రపాతంబులన్ వ్రచ్చియున్, ధూర్తకాణాదవాదంబులన్ ముల్కోలంబోని పెన్బల్కుం బల్కులన్ జేసియున్, బాణసంగ్రామరంగంబునన్ భక్తరక్షర్థమై దీక్షితుండై వృషారూఢుడై స్వీయవర్ణంబుతో వాడిశూలంబుతో వచ్చి శ్రీకృష్ణదేవున్ మునీంద్రాభివద్యున్ సురారాతిపప్రాణ నిర్వాపణా

హేంద్రునిన్డాసి మారాడిపోరాడి నిర్వీర్యుడయ్యున్ జరాభూతు డయ్యున్ స్వభూతప్రకాండంబుతో గాందిశీకుండుగానైన గౌరీశపాదాబ్జసేవా సముద్ధండ దీక్షాప్రచండ ప్రభావంతులన్ శైవులన్ దూది పింజంబునా దూలపుచ్చున్ విరోధించి జృంభించి డంబప్రతాపంబు లన్ వాదములోసేయు భాట్టప్రచారాఘమున్ వారికిన్ జంట గాదంటవై హేతుదారిద్ర్య బుద్ధి ప్రభాకారులై యున్న ప్రాభాక రాఖ్యాత మార్గ ప్రతిష్ఠాపనాచార్యులన్ దర్క బాణ ప్రహారంబులన్ జీల్చియున్ జెండియున్ వంచియున్, జూచి తీవ్రించిద్వేషించి రోషించి దూషించి మూర్ఖోన్న ప్రచ్ఛన్నబౌద్ధాఖ్య లన్ శ్రుత్యపార్థ ప్రతీపాదనాచోదనారక్త దుర్యుక్తులన్ శూన్యవాదాభిషంగప్రగల్భత్వ సందీప్తిలన్ బట్టి ఛేదించి శ్రుత్యర్ధ సంరక్షగావించి మున్ముందుకున్ రాగబోనీక కాళ్లం బెనంగొన్న వీరుల్లతావారముంబోని తత్భాస్కర జ్ఞానవర్తిష్ణులన్ ధీలవిత్రంబు తోలూనముంజేసి శీర్షంబుపైకెత్తి బుస్సన్ననాగేంద్ర మంత్ర ప్రభావంబుమై వేగలోగొన్న చందాన నద్వైతబోధజ్ఞు (యాదవ ప్రకాశు) యేవం విధానూన విజ్ఞాన విక్రాంతి సంక్రాంతి దీపించి కోట్యర్క కాంతిచ్ఛటాశోభితుండై విభూతి ద్వయోద్ధారకుండైన రామానుజస్వామి, దేవా! యుడైవర్, యతీంద్రా, కృపా సాంద్రా! నీయాజ్ఞాయా శాంతవిశ్రాంత మౌగాక నీకున్ జయం బయ్యు నీకున్ నమస్కారముల్ తండ్రి ! నీకున్ సదా మంగళంబే నమస్తే నమస్తే నమః.

30. యతివరేణ్యకల్యాణగుణాఢ్యములగు
మహితపాదంబులకు మంగళంబు.
కటి ధరించిన సన్ననికావివస్త్రమునకు మంగళంబు,
సతతముపూతపసిడిబోని యెల్లని విగ్రహామునకు మంగళంబు,

వక్షస్థలంబున డంబుమీఱు మహిత యజ్ఞసూత్రమునకు మంగళంబు,
కనక కల్పభూజంబుశాఖలుగనగుచు మోక్షదానచణమ్ముపై పుడమిచేత
నావన సమర్థములయి పదోక్షవకుళ సుతులసీమాలికా ప్రశోభితము లైన మహితభుజయుగ్మమునకు ను మంగళంబు.
సంతతానుభావ్యమయి - స్వామిదర్శనమ్ముచేత సంకోచభా-వమ్మెఱుంగ
కుండు తిరుముఖ-మండల జ్యోతికెపుడు, మంగళము గల్గుగావుత-మహితగతుల భగవదనుభవ వ్యాపార-పరతవలన, స్వాశ్రితజనాఘతాప-సంహారకలన
బొడము నానందమునబుష్పము వికసించు, మాడ్కిబ్రీతిని బ్రకటించు-మందహాస భక్తి శ్రీరంగనాధ సంపద్విశేషములును శ్రీవైష్ణవ విభవ-ములను గనుచు
నవ్యయానందబాష్ప ని-ష్యందములయి, దర్శనముమాత్రశ్రిత దురితముల నడచు కన్నుదోయికి నిత్యమం-గళములవుత.
చెలగి వానిబ్రకాశింప-జేయగలిగి, పరగ శ్రీవైష్ణవశ్రీకి-వర్ధనమయి స్వర్ణపర్వతసానుదే-శములదనరు, వికసిత ధవళాంబుజముల - విధముపాసగ తళుకు బంగరుమేనును - దాల్చినట్టి, ద్వాదశోర్ధ్వ పుండ్రములనేర్పడి వెలుంగు మహిత సౌందర్యమునకు సన్మంగళంబు
విహితపద్మాసనస్థులై - వేడ్కదనరి
యుభయవేదాంతభావసుద్యోతకమయి
సరసపరతత్వబోధ సూ - చకముగాగ
నర్థి జ్ఞానముద్రగొనుశ్రీ - హస్తమునకు
మంగళము మంగళము నిత్యమంగళమ్ము.

30.

## ద్విపద

జయమంగళము నిత్య జయమంగళము
త్రయిగన్నమాయతి - రాజచంద్రునకు ॥ జయ ॥

వేదబాహ్యమతగ - వృక్షబృందముల
ఛేదించివైచిన - శేముషీనిధికి ॥ జయ ॥

తెరలిపైబద్ధకు - దృగ్మతస్థులను
తఱిమిగొట్టినబుధ - దైవతమునకు ॥ జయ ॥

ఇలనెల్లలోగొన్న - ధృష్టుడౌకలిని
జలమున బారంగ - జఱచిన హరికి ॥ జయ ॥

శ్రీరంగనాథుల - చెలువంబులెల్ల
తీఱిచి దిద్దిన - దివ్యతేజునకు ॥ జయ ॥

చెలగు వేదార్థంబు - శ్రీభాష్యమనగ
వెలువరించిన యట్టె - విజ్ఞానఖనికి ॥ జయ ॥

ధరణినమాళ్వార్ల - తిరువాయిమొళిని
వరవృద్ధిగూర్చిన - వైష్ణవాగ్రణికి ॥ జయ ॥

తిరువాయి మొళిసార - శరణాగతియను
పరమ ధర్మంబును - బ్రచురంబుసేయ
గద్యత్రయీూత్రయి - గరుణసాదించి
హృద్యస్వరూపుడై - యొసగు శేషునకు ॥ జయ ॥

శ్రీ పెరంబూదూరు శ్రీనగరమున
గాపాడబుట్టిన - కలుషాంతకునకు ॥ జయ ॥

మంగళమెంబెరు - మానార్లచెలువు
రంగైన శ్రీపాద - రాజీవములకు ॥ జయ ॥

32. శాంకరభాట్ట భాస్కర యాదవాదిక
వేదబాహ్యామతముల్ వేఱుసెడగ
నిర్మూలమగునని - నిఖిలవేదంబులు
మోదించివెలిగిన - పుణ్యదినము
వెంగలికలియిక - బృధ్విలోదనయేలు
బడిచెడిబడలిన-భవ్యదినము
తనభారమిదెడిగ్గె - ననిధరా
దేవి దీపిలిన - దివ్యదినము
ఘనపరాంకుశ - పరకాల నాధాదుల
శ్రీలు వర్థిల్లిన - మేలుదినము
శ్రీరంగ కరిగిరి - శేషాద్రిముఖ్యాది
వ్యస్థలుల్ పేర్గన్న - యమలదినము
ప్రవిచలచ్ఛోణమత్స్యముల్ - వాః ప్రపూర్ణ
ముల్ తటాకముల్ కేదార - భూములొప్పు
భూతపురి నిళైయాళ్లార్లు - ప్రీతిగదుర
నవతరించిన యార్ద్రతో - నైనదినము.

33. యతిరాజ, యెన్నినా - ళ్లతినీచమైన యీ
తనువున దాసుండు తనరవలయు

ఈ శరీరంబింక నేవేళనేచోట
నేరీతిబడిపోవు నెఱుగరాదు
అజ్ఞానమిసుమంతయైన వీనికిలేదు
సర్వజ్ఞులెఱుంగ-జాలు, వారు
కృపతోడ వీనినంగీకరించి వివేక
మిచ్చిరి మేనిపొత్తింకనొల్ల
దనువుదొలగించి వైకుంఠ ధామమునకు
దాసుజేర్పదేవరవారు - దలచియున్న
త్వరపడక నిష్ప్రయత్నులై - స్వాములేల
యట్లు వేంచేసి యుంటిరో - యానతిండు.

34. వాత్సల్యసౌశీల్యభవ్య కళ్యాణ గు
ణాఢ్యుడవగు-నన్న భక్తి
నాశ్రయించిన వారి - యాగామి సంచిత
ప్రారబ్ధసంజ్ఞిత - పాపములను
బోకార్చి రక్షింతు - బొమ్మంచుబలికిన
శ్రీపతిమీకు వ - శీకృతుండు
దాసునిమాటత-ధ్యంబుగాదందురా
యలితధవచనుల-రగుదురీరు
స్వామిని విధేయగాగొన్న - స్వామివారి
దప్పనమ్యుల గొలవని - దాసుడిట్లు
తనువునన్ దత్కృతదురిత - తతులఫలము
ననుభవింపగ నిర్బంధమగునెదేవ !
పాపములద్రుంచి వైకుంఠపదమునిండు.

35. నన్నుననన్యశేషునిజేసి శ్రీపాద
కైంకర్యమొసగి ర - క్షణము జలుప
దేవరవారు మదిద-లపినజ్ఞాన
కలితములైన ప్రా-క్కర్మవితతి
యింద్రియ విషయభో-గేచ్ఛల నందంద
డెందంబుజొనిపి క-డిందిగలచు
శ్రీవారిపదముల - జిత్తంబనచునట్లు
కరుణమై కర్మమార్గములు మార్చి
శ్రీకూరనాధులు - శ్రీపరాశరభట్ట
రానతిచ్చినైచ్య - మందుదనరు
నఖిల పాపచయంబులకాలయమగు
దాసుదిద్దు బాటొనరించి - తక్షణంబ
విమలుడయ్యునుజ్జీ-వించు విధమదేదొ
స్వామివారలె మానసిరి - పంగవలయు.

36. క్రూరమునైస్వరూపమున - కుంజెడుగే విషయేచ్ఛతాబలా
త్కారమునంబయింబడెడు - దద్విషయేంద్రియసౌఖ్యకాంక్షయా
వారకపాచితంబులను - బాపముద్రుంపని నేరమా ! యెదో
కారణమాప్రసక్తికిని - గట్టిగనేనెఱుగన్ యతీశ్వరా !

37. ఇంతకు లేని యర్హతలి - కెప్పుడొముందు జనించునన్న మా
టెంతయు నీటిమూట యను - మేదెగ జూచుట కానిమాట దు
ర్దాంతదురంతకిల్బిషవితానము గూల్చి యసత్తమంబు శ్రీ
కాంత పదంబొసంగిమికి-కారణమానతి యిమ్ముదైవరా !

38. నిరతిశయప్రభావమును - నిస్తులతేజముగల్గి యొప్పు దే
వరయడుగుల్ లభించియును - బాడు మనంబు నిహీన వస్తుభో
గరుచిని బర్వులెత్తుచును - గాదని సిగ్గిలదంతెగాక దు
ర్ధరమనియైన లోన, నను - తాపము వొందదు దీని గాంచినన్.

39. బాల్యమున లేక పెద్దయై-బడయరాదు
మోకయై గాక వంగదు - మ్రాకుగనయి
*యైదుతెలియక యేబది - యరయగాదు
ఇట్టినానుడుల్ననుబట్టి - పుట్టెనోటు !

చేదని గుర్తెఱింగి యు భు - జింపగ గూరగ వండికొన్నవే
మాదటనారగించు గొని - యాడుచు నట్టుల ఘోరకిల్బిషో
న్మాదుడటంచెఱింగియభి - మానముసేసిన దానునో మగా
గాదని త్రోసి పుచ్చరని - గట్టిగనమ్మితి మిమ్మునెమ్మదిన్.

40. కనదౌదార్యభవత్పదాబ్జ విలస-త్కల్యాణకారుణ్యభా
జనభవ్యంబగు కాలమేగె వృధగా - సంసారనిర్బంధ వే
దన ఘూర్ణిల్లుదు నిద్దియెల్లయునుత్వ - ద్దాక్షిణ్యమో, చాలు, నో
యనఘా ! విష్ణుపదంబొసంగుమికదే-హాస్నేహముంబాపుచున్.

41. కలదే వీనివలన్ సమస్త దురితా-ఘంబుల్ నిమేషంబులో
జలుపన్నేర్చిన దిట్ట వేఱొకడుక్ష్మా-చక్రంబు నందెందు, మీ

* ఐదుయనగా యర్థపంచక జ్ఞానము. అవి 1) స్వస్వరూప, 2) పరస్వరూప, 3) ఉపాయస్వరూప, 4) ప్రాప్తిస్వరూప, 5) విరోధి స్వరూప.

వలెనీ రెండు భువంబులన్ దురితమో - ర్వంగల్గు వాడన్యుడున్
గలడే యోగి జనాగ్రగణ్య ! కరుణా - కంభీ ! కటాక్షింపవే.

42. ఘనపంచేంద్రియవర్గముక్కటిగనన్ - గారింపసైరింపవే
కను మీ పాదములన్ స్మరించి మదిలో - గంపించి రామానుజా
యని యాక్రందనముంబొనర్తుయతిరా-జా! తండ్రి వే వచ్చి బా
ధనముల్ మాన్పుత్వదన్యవేరుగలరే - దాసున్ కటాక్షింపగన్.

43. ఖరదుఃఖాలయమీజగంబుపయి - గాంక్షల్ మెండువైకుంఠసు
స్థిరవాసేచ్ఛయుగల్గదీ మనకుర - క్తి వ్యగ్రుడౌ తండ్రి యెం
బేరు మానార్ల సమానవిష్ణుపదమి - ప్పింపంగటాక్షించుటే
కరణిన్ సంభవమంచు నెంచి మదిలోగాసిల్లి భీతిల్లెదన్.

44. వెలుపలలోన నెల్లెడల - విశ్వమునంతటనిండ విష్ణుడున్
వెలయుటెఱుంగు జ్ఞానులకు - పృథ్విరహస్యతమస్థలంబులుం
గలుగవు మూఢబుద్ధులకు - గల్గుటజేసి దురంత పాపమున్
పలిపి నశింత్రు నీచరణ - సంగతి పాపు సమస్తదోషముల్.

45. కనజీవాత్మల మెల్లనారములు శ్రీ-కాంతుండు నారాయణుం
డను దివ్యార్థము వీరికైనదియనా-ద్యంబైన సంబంధమం
చును నాచార్య కృపాప్రలబ్ధమదియం-చున్ లజ్జవోనాడినీ
వను సంధింపుమచిత్తమా ! సతతము-ద్యజ్జీవనోత్సాహివై.

*46. పరమదయా పయోధి తిరు-వాయ్మొళిపిళ్ల గురుండుక్రూరదు
స్తర దురితాత్ములన్ మనల - జాడ నెఱింగి యనుగ్రహించిత

* (పరగగ శ్రీనివాస గురు-వర్యుడు దారగుణుండు క్రూరదు)

ద్వరతిరుమంత్రమర్థ సహి-తంబుగ దెల్పియుజ్ఞాన వస్తువై
వరలగ జేయగాదెయతి - వర్య సపర్యలభించె జిత్తమా !

47. ప్రేమయై శ్రీమతేరామానుజాయ న
మోయనరేబవల్ - ముదిమలవుచా
బలుకనేరని వారి - పజ్జ క్షణంబైన
నిలువనేరనిధర్మ-నిష్ఠులైన
శ్రీకూరనాధాది - శ్రీవైష్ణవులకు
సకలవిధసేవలు - సలుపనట్టి
మనుజులు మనుజులే - మహినిజతుష్పాద
జంతువుల్ గాన నిజంబుగాగ
అట్టివారల సాంగత్య - మాదరింప
రాదు మనసిచ్చిమాటాడ - రాదుకోరి
పిలిచి యాతిధ్యమిడరాదు - కలలనైన
నంజలి ఘటింపరాదు స-త్యంబుసుమ్ము.

48. కలిపాపోపహతస్వభావజన ర-క్షాదక్షు రామానుజున్
దలపన్ నేనిఖిలున్ స్మరించుటకుడెం-దంబొప్పదీమస్తకం
బెలమిన్ మ్రొక్కదు వాక్కు పేర్కొనదు క-న్నక్షింపదీయింద్రియం
బులనన్యాశ్రయవృత్తి గొల్పునెరమా-భూజానియధ్యక్షుడై.

48అ. అనుభవముచేత దీఱని-యమితఘోర
నరక సంసార కూపము-న బడిచెడక
యర్థియుజ్జీవనముసేయ - నభిలషించు
రేని వినుడు చెప్పెదనొక - హితముమీకు.

49. నరులారా ! సముపాశ్రయింపుడు లెసన్ - రామానుజాచార్యు ద
త్తిరు నామంబు స్మరింపు డెల్లపుడుత - ద్దివ్యాంఘ్రికైంకర్యత
త్పరులౌ వైష్ణవసాహచర్యమును సం-పాదింపుడీ, ముక్తి చే
కుఱు సందేహములేదు దీనకరుణా కూపారుడా తండ్రియున్.

50. తిరునామ స్మరణంబు సేయక వృథా - ధీశూన్యులై కాలముం
జరుపన్నేర్చియ ఘాబ్ధిలోబడినయో - సంసారులారా,యతీ
శ్వర, రామానుజ, యంచు బల్కుడుతప-స్సాధ్యంబుగానట్టి మో
క్షరమాశ్లేషసుఖంబు సూరిజనసాం-గత్యంబు ప్రాప్తించెడిన్.

51. అరయనియామకుండు భగ-వంతుడుగల్గిన నాడెయున్నవా
డరయనియామ్యచేతను-డనంత పురాకృతకర్మబద్ధమై
జరిగినకాలదుర్వ్యయవి-చారమెఱుంగనిదాసు చిత్తమ
ద్దిర! యనుతాపదగ్ధమగు - దేవర సత్కృప జూచుటాదిగాన్.

52. బంగరుకొండనెత్తమున - బర్వువినీలపయోదమట్లుది
వ్యాంగము సొంపునింప విన - తాత్మజునెక్కియతీంద్రుమాఱుగా
ముంగలనిల్చి వేనగవు - ముద్దులగట్ట ననుగ్రహించు శ్రీ
రంగశయానుగాంతునచి - రంబగు దేహమువాయు నప్పుడున్.

53. శ్రీరంగ దేవుండు - శ్రేయంబు గలిగించు
తలపుతో వెతవిదు-టలు గ్రహించి
తాత్కాలిక వ్యథల్ - తాళలేకయ్యయో
యనిపలవించుదే-హంబుతోడ
సంసారమందుంటి-శక్యమా! దేహమ
దంబున గర్మప-థంబువట్టి

బహుళపాపావృత్తి-బడలినదాసుని
దల్లియుదండ్రియు-దైవమవుచు
జీరికైంకర్యవర్తిష్ణు-జేసిరట్టి
యనుపమానసంబంధంబు-నాదరించి
పరమపదముప్రసాదింపు-త్వరితగతి, య
తీంద్రయెంబెరుమానారు - యెఱుగువాడ.

54. అక్కట తుచ్ఛమైన తను - వందు వసించుచు నెంతకాలమీ
చక్కిశ్రమింతు, నెప్డొడలి-సంగతి బాపి పరంబు గూర్తు నీ
వొక్కడ వొదు వేడుగడ-యున్, శ్రితసౌఖ్యవిచారదృష్టిలో
బొక్కదు రేబవళ్లు యతి-పుంగవ ! యానతియిమ్ము సత్కృపన్.

55. శ్రీరంగనాధని-ర్హేతుకకరుణా క
టాక్షలక్ష్యమగుభా-గ్యంబుగంటి
క్షమ సర్వ దివ్యదేశ ప్రధానంబగు
శ్రీరంగభూమి వ - సింపగంటి
ప్రధితనమ్మాళ్వార్ల - ద్రవిడవేదములెయ
భ్యవహారముగగాంచి - బ్రతుకగంటి
మధురకవ్యాళ్వార్లు - మధురచరమపర్వ
నిష్ఠనభీప్సిత-నిష్ఠగంటి
ప్రాక్తనాచార్యవా-గ్వైభవములస
రహస్యాభ్యసనముసే - యంగగంటి
వేఱుగ్రంధావలోకనా-పేక్షవిడిచి
వానితోడి కాలక్షేప-పరతగంటి
పఱులయతిశయముగనియో-ర్వంగగంటి
నెంతలాభంబు గంటినో-యెఱుగగలనె !

56. యతిరాజా! భవదీయదీప్యదభిమా-నైశ్వర్య సంప్రాప్తసు
స్థితి యుత్తారక మాత్మకన్నమతిదీ-ప్తిం గూర్చినారట్లు, దు
స్థితులంగుందగనీక నేర్పు మెయిమీ - శ్రీపాదముల్‌జేర్పరే
నతులంజేయుదు విష్ణులోక మహితా-నందానుసంధాయకా.

*57. వరదుడు శ్రీనివాసగురు - వర్యుమహాత్ముపదారవిందమున్
తిరముగగొల్చి కన్నసము-దీర్ణ సముంచిత శేషశేముషీ
భరుడితడంచు స్నేహమున-స్వాశ్రితదోషమెఱుంగకుండు దే
వర! యిటు నాజడోక్తులను-బాయక త్రోయక యాలకింపుమా.

58. పరమ నిర్వ్యాజకారుణ్య - భావలసితు
డైన తిరువాయిమొళిపిళ్ల యాదరించి
పరగదేవర వారల-తిరువడిగళు
జేర్చి సంబంధమెఱుగంగ-జేయుకతన
నాత్మకును తిరుమంత్రంబు-నందుజెప్ప
బడిననవవిధసంబంధ-భావమెల్ల
నలియరికి స్వామితోడనే-యలరుననన్న
దార్ఢ్యభావంబుగలిగె డెం - దంబునంద.

59. తల్లియు దండ్రియు - దైవంబు సర్వంబు
తానగుశ్రీరంగ - ధామవిభుడు
కాంచనాద్రినిబోని - గరుడవాహనమెక్కి
యందంబు చందంబు-లతిశయింప
కస్తూరి తిలకంబు - కమనీయ మందహా
సంబుడంబొదవు ము - ఖంబుతోడ

*57. వరగురుమాన్యుడైన తిరు-వాయ్ మొళిపిళ్ల పదారవిందముల్

బ్రత్యక్షమై యర్చిరాది మార్గమ్మున
నను దోకొని చనుట-మననమేను
జలుపుచును ధైర్యముననుండ-గలుగుకొఱకు
నీనికృష్ట దేహము బాయు-టెపుడొయాది
నం బెఱింగింపుయతిలోక-నాథ ! దేవ
దేవ ! రామానుజా ! తండ్రి ! ధీపయోధి.

60. శ్రీయతివరులకు - శ్రీరంగపతిసుఖ
ముగమీరు శ్రీరంగ-పురమునందు
వసియింపుడని యిచ్చె - వరమదిమనదియే
నిరుపాధికజనకు-డరయనతడు
దాసులమాతని-తనయుల మట్లోట
నతని సొత్తునదాయ-మడరు మనకు
ప్రాప్తికైయత్నింప-బనిలేదికమనకు
భరము రామానుజ - స్వామియదియె
అతడుభయ విభూత్యైశ్వర్య-మర్థిబడసి
పెరియపెరుమాళ్ల కృపచేత - విష్ణుభువన
మార్గదాయియై యున్నాడు - మానసంబ
వాని పాదముల్ దిక్కుగా - బ్రదుకు బ్రదుకు.

శ్రీమతే రామానుజాయనమః
శ్రీమతే వరవరమునయే నమః
ఎంబెరుమానార్ తిరువడి గళేశరణమ్
పెరియజీయరు తిరువడిగళేశరణమ్.

శ్రీమతే నారాయణాయనమః

# ఆర్తిప్రబంధము - ఆంధ్రానువాదమునకు లఘుటిప్పణి

అనువాదకులు - శ్రీమాన్ అబ్బరాజు వీరరాఘవస్వామిగారు

శ్రీమాన్ అబ్బరాజు వీరరాఘవస్వామిగారు తమజీవిత చరమాంకములో ద్రావిడ దివ్యప్రబంధ పద్యములను తమిళమూలమునుండి తెలుగులోనికి అనువదించి, తెలుగుపాఠకలోకమునకు ఎనలేని మేలు చేసిరి. వానిలో యొకటి ఆర్తిప్రబంధము. ఈ ప్రబంధములో శ్రీమద్రామానుజుని అవతార మైన శ్రీమణవాళమహాములు తనయారాధ్యదేవతా స్వరూపమయిన శ్రీమద్రామానుజుల కృపాపారీణతను, అమోఘుయుద్ధారకత్వమును సోదాహరణముగా ప్రవచించిరి. ఆంధ్రానువాదమునసుసంధించువారు కూడ రామానుజ కృపాపాత్రులై తరింతురనుటలో సందియము లేదు. నారాయణ, రామానుజ పదములలో నాలుగక్షరములు. యతిరాజవింశతి 5వశ్లోకములో వివరించినట్లు తనయష్టాక్షరి (ఓమ్ నమోనారాయణాయ) నిష్ఠను నారాయణునికి కాక, రామానుజునకే వర్తించునని ప్రతిపాదన చేసెను. ఎఱుంబి అప్పా తనపూర్వాదీనాచార్య 16 శ్లోకములో 'యతీంద్ర చరణ ద్వంద్వ ప్రవణేనైక చేతసా' అని వెలువరించినట్లు మణవాళ మహాముని తనమనోవాక్కాయ కర్మలను శ్రీమద్రామానుజ పదరాజీవ ముల కంకితము చేసెను.

శ్రీరంగనాథుని వరప్రసాదముచే శ్రీమద్రామానుజులు తన నిరంతర కృపాధారాలతో ఈ సర్వప్రపంచజీవులకు ముక్తినొసగవలసినదని మణవాళ మహాముని యాలక్ష్మణ యోగిని ప్రార్థించుటయే ఆర్తి ప్రబంధార్గత ముఖ్యాంశము.

ఆంధ్రానువాదమునకు తాత్పర్యము వ్రాయుటకు పూర్వము విశిష్టాద్వైతము (ఎంబెరు మానారు దర్శనము) గూర్చి కొంచెము తెలిసి కొందము. ఆనందతీర్థులు (మధ్వాచార్యులు) హరిసర్వోత్తముడనియు, జీవరాసులు సత్యములై పరమాత్మకు భిన్నముగా యుండునని ద్వైత

సిద్ధాంతమును ప్రతిపాదించిరి. శ్రీశంకర భగవత్పాదులచే ప్రతిపాదితమైన అద్వైత సిద్ధాంతము - బ్రహ్మమే సత్యమనియు, తక్కినవస్తువులు భ్రాంతియని ప్రకటించుచున్నది. చేతనాచేతన ద్రవ్యములు బ్రహ్మమువలె సత్యము లనియు, అవిపరబ్రహ్మాంశలని, పరమాత్మపై యాధారపడి మనుగడ సాగించుచున్నవని విశిష్టాద్వైతము స్పష్టముగా తెలియజేయుచున్నది.

తత్త్వము శ్రీమన్నారాయణుడు. శ్రీదేవి ఆయన సహవాసి (హ్రీశ్చతే లక్ష్మీశ్చపత్నే - పురుషసూక్తము). నారాయణుడు పవిత్రగుణ సంపదలను బోషించువాడు, రక్షకుడు. శ్రీదేవి, నారాయణులు దివ్యదంపతులు. నారాయణుడు మన శరీరములకు ఆత్మ (అహమాత్మా గుడాకేశ సర్వభూతాశయ స్థితః - భగవద్గీత 10-20) శరీరి శరీర సంబంధము విశిష్టాద్వైతమునకు చెందినది. వ్యాసప్రోక్తములైన బ్రహ్మసూత్రములు కూడ శరీరి శరీర సంబంధమునే విశదపఱచును. శ్రీ భాష్యము, శ్రీమద్రా మానుజులు బ్రహ్మసూత్రములకు వ్రాసిన వ్యాఖ్య. ఈతత్వజ్ఞానము ఫలవంత మగుటకు సాధనలేక ఉపాయములవలంబింపవలెను. మోక్షప్రదాత నారాయణుడే యుపాయము. దివ్యదంపతుల కృపాకటాక్షములను పొందుటకు నిర్దేశింపబడిన జ్ఞాన, కర్మ, భక్తి యోగములు మరియు ప్రపత్తి మార్గము అనువానిలో యే యొక యుపాయమునైన ననుష్ఠించిన యెడల మానవజాతికి పరమగమ్యమైన మోక్షమును దివ్యదంపతులను గ్రహించెదరు. మోక్షము పొందువారికి పరమానందకరమగు భోగ్యవస్తువు శ్రీ మరియు ఇందిరా సహచరుడైన నారాయణుడే. కావున దివ్యదంపతు లైన లక్ష్మీనారాయణులే పరతత్వము, పరమోపాయము, పరమగమ్యము అని యుపనిషత్తులు చాటుచున్నవి. విష్ణుతత్వమనాదియైనను, శ్రీవైష్ణవమును పరిపుష్టి నొందించి, అభివృద్ధిచేసి దాని నవలంబించు యనేక భక్తులకు శ్రీమద్రామానుజులే తరుణోపాయము కల్పించెను. శ్రీరంగ నాథుడు, శ్రీవైష్ణవ తత్వమును ఎంబెరు మానార్ (శ్రీమద్రామానుజ) దర్శనముగా పిలువ వలసినదని యాజ్ఞాపించెను.

వైష్ణవతత్వము శ్రీరామానుజులవారికి, వారి పూర్వాచార్యులయిన యమునాచార్య (ఆళవందార్), వారి తాతగారైన నాథముని బోధనల

ద్వారా యబ్బినవి. శ్రీమన్నాథ మునులు, మధురకవి యాళ్వారు విరచిత ఆచార్యవైభవము (కణ్ణినున్ శిరుత్తామ్బు) పదివేలసార్లు తామ్రపర్ణి నదీ తీరమున పునశ్చరణ చేసిన తదుపరి - నమ్మాళ్వార్ల యనుగ్రహముచే నాలాయిర దివ్యప్రబంధము (4000 తమిళ పద్యములు)ను వెలికి తీసికొని వచ్చి రూపకల్పన చేసెను. బ్రహ్మసూత్రములు, వానికి వ్యాఖ్యయైన రామానుజ విరచిత శ్రీభాష్యము, నాలాయిర దివ్యప్రబంధము కలసి యుభయ వేదాంతముగా వ్యాప్తిలోనికి వచ్చినవి. నాలాయిర దివ్యప్రబంధములోని సూక్తులు జనసామాన్యమునకర్థమగు రీతిలో తమిళములో రచింపబడుట వలన జనాదరణ పెరిగినది. వానియనువాదము తెలుగువారికి చాల యుపకారిగా యున్నది.

**రామానుజదర్శనము :** (1) తిరుమంత్రము 'ఓం నమో నారాయణాయ' (2) ద్వయము 'శ్రీమన్నారాయణచరణౌ శరణం ప్రపద్యే శ్రీమతే నారాయణాయనమః' మరియు (3) చరమశ్లోకము 'సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ, అహం త్వా సర్వపాపేభ్యో మోక్ష యిష్యామి మాశుచా' అను ఉపదేశ త్రయమును సూచించును. దేవమానవ సంబంధమును తెలిసికొనుటకు సూక్ష్మదృష్టిలేక అంతర్దృష్టి ( Insight )ని ప్రసాదించును గాన ఈ వేదాంత వాఙ్మయమునకు దర్శనమని పేరు వచ్చెను. అడుగుటయే తడవుగా జ్ఞానమొసగి, అర్హతను గమనింపకయే మంత్రోపదేశము చేసి, గుర్వాజ్ఞమీరుటచే తనకు ముక్తి కలుగక పోయినను, తనవలన దీనజనావళికి మోక్షప్రాప్తి కలుగుటయే తనకు పరమానందమని తనగురువర్యులైన గోష్ఠీపూర్ణులకు తెలియజేసినపుడు, గురువాశ్చర్యపడి నీవే నాయజమానివి (ఎంబెరుమానార్) అని రామానుజు నకు బిరుదునొసగెను.

ఇక రామానుజదర్శమును ప్రతిబింబించు ఆర్తి ప్రబంధ అను వాదము నర్థము చేసికొన ప్రయత్నింపవలెను. ఇందరువది పద్యములున్నవి.

**1) రామానుజ (యతిరాజ) కరుణాకటాక్ష వీక్షణకై తపించుట :-**

(1 నుండి 9వరకు పద్యములు) యతిశేఖరా ! నీకు ముమ్మాఱు

మంగళము పలుకుదును. సాష్టాంగపడి మ్రొక్కెదను. అట్లు మ్రొక్కని వారితో చెలిమి చేయను. దేవరవారె నాకు తల్లిదండ్రులు, సఖుడు. ఈ తనువొక చెరసాల, నీపై నిష్ఠకిది ప్రతిబంధకము. దీనిని విడిచి నీ కృపాకటాక్షములతో మహావిభూతి ( శ్రీవైకుంఠము ) కి చేరువ యెప్పుడో ! దేవరకు నేను సూనుడను, దాసుడను. నాపై కృపను వర్షింపజేయుమా ప్రభూ ! చనుబాలు త్రాగు బాలునకు వచ్చువ్యాధికి యౌషధము సేవించు, బావి యొద్దకు చేరి ప్రమాదస్థితిలోనున్న బాలునికై బాధపడు, తల్లివలె నాజడత్వము బాపుటకు నీవు అవతారమెత్తితివి. ఈ మానవావతారములో నీకు నాకు బంధుత్వమేర్పడెను. (గోపికలకు, కృష్ణునికి యున్న బంధుత్వము, తిరుప్పావై 28 పాశురము చూడుము.) కావున నన్ను కటాక్షింపుము. ఇవియే నా నమస్కృతులు.

౨) **శ్రీరామానుజ పాదపద్మయుగళమే శరణ్యము :** (10 నుండి 19 పద్యములు ) శ్రీరంగేశుని పాదములపై ధ్యానముంచి స్వరూపహేతు భూతుడే శ్రీమద్రామానుజుని, సర్వము విసర్జించి నత శీర్షముతో కైంకర్యము చేయు వడుగనంబి (రామానుజుని శిష్యులగు పుర్వా -చార్యులు) వలె నీపాదసేవ సలిపి మనస్సునుజ్జీవింప జేసికొందును. తిరువాయ్‌మొళిపిళ్లె గురుత్వములో మణవాళ మహామునులు రామానుజ పదసేవా పరిచారకుడగునట్లు, శ్రీనివాస గురుదేవుని యనుగ్రహముచే నేను (వీరరాఘవస్వామి) నీపద సరోజములను నమ్మితిని. నీ పాదసేవా రసస్వాదనముచే ముమ్మారు మంగళము పాడువారికి సౌలభ్య, సౌశీల్యురయిన యాళ్వార్లు కరుణ జూపుదురు. ఓరామానుజా! నీపదములే శరణమనుచు మ్రొక్కెదను. నీవు ఘనవిజ్ఞాన సంపన్నుడవు. నాకాజ్ఞానము లేదు. కూడని పనుల నజ్ఞానముచే చేయుచుంటిని. సంస్కారమిసుమంతయు లేని ఘోర పాతక సమాజములో యుండిన నాకు నీ పద రాజీవములే గతి. పాప కృత్యములను సలుపునాకు, కాళరాత్రిని హరించు సూర్యో దయము వలె నీ కరుణాకటాక్షములుజూపవలె. పుత్రుని నీచ సేవలకు బాధపడక, జనకుడు సహించునుగదా.

3) **అర్చిరాది మార్గము - పరమపదప్రాప్తి :- (20 నుండి 28 వరకు)**
స్వాచార్యకృపచే కలుగు విజ్ఞానమును సాధనముగాగొని, స్వాచార్యాభిమానంబె తారకమంత్రముగా శ్రీరామానుజులే మనల నుద్ధరించుననని యధిక భక్తితో ప్రార్ధనచేసిన, వారు మనలను పరమ పదము జేర్వగలరు. స్వాచార్య కరుణకలిగినపుడు రామానుజులు మనలను సంసార బంధము నుండి విముక్తి చేసి శ్రీవైష్ణవమను నావచే, కళ్యాణగుణగణముల కాలయమగు పరమపదనాధుని దివ్యచరణముల చెంతకు జేర్చును. ఈ క్రింది శ్లోకమును గమనింపుడు.

ఈశ్వరస్యచ సౌహార్దం యదృచ్ఛా సుకృతం తధా
విష్ణోః కటాక్షం అద్వేషం అభిముఖ్యంచ సాత్వికైః.
సంభాషణం షద్ ఏతానిహి ఆచార్య ప్రాప్తి హేతవః

పరమాత్మసౌహార్దత, అప్పుడప్పుడు చేయు పుణ్యకార్యములు, పరమాత్మ దివ్యానుగ్రహము, అన్వేషము, అభ్యసించుటకు ఇచ్ఛ మరియు సత్పురుషులతో సంభాషణ ఆచార్యాభిమానమునకు హేతువులు.

పరమపదముజేరుటకు ముక్త ( ప్రాకృత శరీరమును విడిచిన ఆత్మ) విరజానదిని దాటి, తాపత్రయములన్నింటినెడబాసి, శుద్ధ సత్వ మయిన (సాత్వికగుణము గల) దివ్యశరీరమును దాల్చినపుడు, నిత్యసూరులు (ఆదిశేషువు, గరుడుడు, విష్వక్సేనుడు; నమ్మాళ్వారు, రామానుజ మొదలగు పూర్వాచార్యులు) యెదురై శోభాయ మానమైన వైకుంఠనగర ద్వారము యొద్దకు జేర్చుదురు. అప్పుడు ముక్తకు పరమాత్మ యొడిలో కౌగిలి లభించును. ముక్త దివ్యసోపాన మార్గమీ విధముగా యంచెలంచెలగాయున్నది. (1) సూర్య మండలము, (2) బ్రహ్మాండము (3) సప్తావరణములు (4) విరజా నది (5)అ మానవ (దేవతారాయుబారి) స్పర్శ (6) నిత్యసూరుల సందర్శనము (7) వైకుంఠనగరములో సూరి బృందములో జేరుట. అటు పిమ్మట పునర్జన్మ యుండదని భావింపవలెను. ఉద్దేశ్య

పూర్వకముగా కాని, మూఢత్వముచేగాని, పరమాత్మ ఆజ్ఞానుసారము కాని, మరియే ప్రమేయము చేతనైన ముక్త ఇహలోకములో తిరిగి యడుగుపెట్టడు. ప్రాక్తనవాసనలచే యేమైన యపరాధములు చేసినను, దోష ప్రవృత్తిచే వ్యవహరించినను, శ్రీవారి దాస్యము స్వీకరించుటచే శ్రీమద్రామానుజులు పరమపదప్రాప్తికి అర్హుని చేయును.

విశిష్టాద్వైత సిద్ధాంతము ప్రతిపాదించు దాసత్వము బానిసత్వము కాదు. అహంకారము నుండి విడుదలచేసి, జీవికి సర్వతోముఖ నిష్కృతియను సక్రమ పంథాకు జేర్చును. రామానుజులు తప్ప మరెవరయిన (దేవదూతలయిన, పూర్వాచార్యులైన) నాదోసము లను సహింపరు. ఓ రామానుజా ! నీవే నన్ను వైకుంఠమునకు జేర్ప గలవు. కావున శరీరావసానదశకై నిరీక్షించు చుండును. మితిలేని యానందమును శ్రీవైకుంఠములో నిత్యసూరుల సమక్షములో యనుభవింపవలెనని యువ్విళ్లూరుచున్నాను. కావున తండ్రీ ! ఈ దాసుని కరుణింపుము - ఇదే నా ప్రార్థన.

**4) కుమతావాదుల యాటకట్టించిన యతీంద్రులకు మంగళము :-**

(29 నుండి 32 వరకు) ప్రత్యక్షముగా చూచినవే నమ్ముచు, ప్రమాణమును తిరస్కరించిన నాస్తిక వాదులైన చార్వాక, సంజ్ఞాక, జైన, శాక్య, సాంఖ్య, కాణాద మతాచార్యులను వాగ్వివాదములో యోడించి, సిద్ధాంతపరముగా వారి పల్కులను తీవ్రవాదములతో వమ్మొనరించి ; బాణునితో యుద్ధముచేసి యోడించి, వానిని రక్షింప వచ్చిన శివభక్తులను దూలపుచ్చి, భాట్టప్రచారమును హేతు వాదముతో, ప్రాభావకరమతా చార్యులను తర్కమీమాంసచే పీచ మడచినవాడవు. దానిని చూచి ద్వేషించి, రోషించిన బౌద్ధుల దుర్యుక్తులను శుష్కవాదమునను, శ్రుతికి (వేదమునకు) అపార్థము చెప్పినవారిని భేదించి, శ్రుతులను రక్షించి, ఇకముందు కూడ యిటు వంటివి జరుగకుండ తగు యేర్పాట్లను జేసినవాడవు. అద్వైతబోధ చేయు యాదవ ప్రకాశకుల యపార్థములను ఖండించి, వారిని కటాక్షించి శ్రీవైష్ణవంబిచ్చినవాడవు. నీకు సన్మంగళము 'కష్యాసం

పుండరీకాక్షమ్' - స్వామి నేత్రములు కోతి పృష్ఠము రంగులో యున్నవని తన శిష్యులకు యాదవప్రకాశకుడు బోధించినపుడు రామానుజులది గమనించి, కప్యాసం అనగా నీటిని యడుగు భాగము నుండి పీల్చు తామరను పోలినవి స్వామి నేత్రములని సరియగు అర్థమును ప్రతిపాదించగా, యాదవ ప్రకాశకులు తమ తప్పుఒప్పుకొనెను. అటువంటి యతివరేణ్యులకు ముమ్మారు మంగళము.

నీ కళ్యాణగుణగణములకు, పదపారిజాతములకు, ధరించిన సన్నని కావివస్త్రమునకు, యజ్ఞసూత్రమునకు (జందెము) మహిత భుజము లకు మంగళంబు. ముఖమండలమునకు మంగళము. ఆశ్రిత జనులపై ప్రసరించు మందహాసమునకు, శ్రీరంగ సంపదను వీక్షించు కన్నుదోయికి, శ్రీవైష్ణవ శ్రీయభివృద్ధికి, పండ్రెండు నామములను ధరించిన బంగరుమేనికి, సౌందర్యమునకు సన్మంగళము (శ్రీమాన్ శ్రీరంగ శ్రియమనుదినం సంవర్ధయ, శ్రీమాన్ శ్రీరంగ శ్రియమనుదినం సంవర్ధయ అను సూక్తిని గమనింపుడు.) పద్మాసనాసీనులై, యుభయవేదాంతబోధను సూచించు మీశ్రీహస్తమునకు ముమ్మారు మంగళము.

వేదబాహ్యులను, కలిపురుషుని తరిమికొట్టిన నీకు జయమంగళము. బ్రహ్మసూత్రములకు వ్యాఖ్యయైన శ్రీభాష్యమును వెలువరించిన విజ్ఞానఖనికి, నమ్మాళ్వారు సాయించిన తిరువాయ్ మొళికి పుష్టి గూర్చిన వైష్ణవశ్రేష్ఠునకు, గద్యత్రయికి (శరణాగతి గద్య, వైకుంఠగద్య, శ్రీరంగగద్య). శ్రీపెరంబూదూరుకు ఖ్యాతి తెచ్చిన యెంబరు మానార్లకు (రామానుజులకు) మంగళము.

వేదబాహ్య మత నిర్మూలనకు (మొదటిపేరాలో పేర్కొనబడిన మతములు) కలిపురుషుని యేలుబడికి యంత్యగీతము పలికిన, పరాంకుశ (నమ్మాళ్వార్లు) పరకాలాదుల (తిరుమంగయాళ్వార్లు) శ్రీమన్నాథమునులు సంపదలు వర్ధిల్లిన, భూతపురి యాళ్వార్లవ తరించిన దినమెంతగొప్పదో కదా !

5) **పరమపదమునకై తహతహలాడుట** :- (33 నుండి 35 వరకు) ఈ నీచశరీరము నెన్నాళ్లు భరింపవలెనో నాకు తెలియదు. పూర్వ పాపములను, ప్రస్తుతము చేయు పాపములను పరిహరింతునని పలికిన శ్రియఃపతి మాటల ప్రకారము ఇతరుల నాశ్రయింపని దాసుని సర్వజ్ఞులగు మీరు పాపరహితునిజేసి వైకుంఠపదము నీయ వలసినది. శ్రీకూరనాధులు, శ్రీపరాశభట్టర్ల ( శ్రీమద్రామానుజుని శిష్యులు, ప్రశిష్యులు) కానతిచ్చిన రీతి, సమస్త పాపముల కాశ్రయ మగు దాసుని చిత్తమును దిద్దుబాటొనరించి, యజ్ఞాపింప జేయ వలసినదిగా తపించుచున్నాను.

6) **నాయజ్ఞానము పరమ పదప్రాప్తికి యాటంకము** :- (36 నుండి 42 వరకు) ఇంద్రియములు నా స్వాధీనమందులేవు. విషయేచ్ఛలో బడి కొట్టుమిట్టాడుచున్న నాకు పరమపదమునకర్హత కలుగునన్న మాట నీటిపై వ్రాత. అర్థపంచక జ్ఞానము లేదు. ( తన అనగా ఆత్మ స్వరూపము, పరయనగా పరమాత్మ స్వరూపము, ఉపాయమనగా శ్రీహరిని జేరుటకాయననే యుపాయముగా యూహింపవలెను, ప్రాప్తియనగా వైకుంఠస్వరూపము, విరోధి స్వరూపమనగా యింద్రియములే విరోధులని భావన.) వేపకాయలు చేదని తెలిసి కూడ యారగించు రీతిని నాయున్మాదమునకవధిలేదు. సంసారము పట్టిపీడించుచున్నది. ఈదాసుని బ్రోవకుండుటకు కారణమేమి ? మీరు కాలవిలంబనచేయక, త్వరగా విష్ణుపదము నొసంగ వలసినదిగా వేడుకొనుచున్నాను.

సమస్త పాపములనొక క్షణములో చేయగల దిట్టను నేను. పాపములను సహింపగలవారు మీవలె ఈ రెండు లోకముల (దేవ, మానవ లోకములు)లో లేరు. నేను మీపాదములు స్మరించుచు రామానుజా ! యని ఘోషించుచున్నాను. నన్నుకటాక్షింప వలసినది.

7) **ఈ లోకములో యాకర్షణలు మెండు** :- (43 నుండి 48 వరకు) ఆకర్షణ లెక్కువగుటచే వైకుంఠము నందు కోరిక కలుగుట

కష్టతరము. విష్ణువెల్లయెడల యున్నాడ (ఇందుగలడందులేడని.......
పోతన భాగవతము, సప్తమస్కంధము, ప్రహ్లాదచరిత్ర 275 పద్యము)
ను జ్ఞానమిా మూఢమతులకు లేదు. నారాయణపదప్రాప్తికి ఆచార్య
కృపలభింపవలెనని మనస్సు రూఢిచేసికొని నీపాదపద్మముల
నాశ్రయించిన సర్వదోషములు తొలగునని నమ్ముచున్నాను.

గుర్వర్థం స్వాత్మనః పుంసః కృతజ్ఞస్య మహాత్మనః
సుప్రసన్నస్సదా విష్ణుర్హృది తస్య విరాజితే-జయసంహిత.

గురువుకొఱకు కృతజ్ఞత చూపు పురుషుని హృదయములో విష్ణువు
తేజరిల్లుచుండును.

శ్రీమతే నారాయణాయనమః అని పలుకని మూఢుల యొద్ద
శ్రీవైష్ణవులొక్క క్షణమైన నిలువరు. అట్లు వారికి సేవచేయని
మనుజులు జంతువుతో సమానము (కంజాక్షునకు గాని కాయంబు
... పాద యుగముతోడి పశువుగాక. పోతన భాగవతము, సప్తమ
స్కంధము, ప్రహ్లాదచరిత్ర 170 పద్యము. తి.తి.దే. ప్రకటన 1998)
శ్రీమన్నారాయణునికి తప్ప యన్యులకు మ్రొక్కదీ శిరము.

8) **ప్రబోధము :-** (49 నుండి 51 వరకు) నా యభీష్టముతో చెప్పు
హితమును వినవలెను. శ్రీమద్రామానుజుని శ్రీనామమునే
స్మరింపుడు. అందువలన వైష్ణవులతో స్నేహము, అసాధ్యమగు మోక్ష
సుఖము ప్రాప్తించును. దేవర (రామానుజ) కృపకలిగినచో యీ
చేతనుని పురాకృత పాపకర్మములు అగ్నిలో బడిన దూదివలె
దగ్ధమగును.

9) **దేహావసానకాలమున శ్రీరంగ విభు కటాక్షము :-** (52 నుండి
59 వరకు) బాధలు తాత్కాలికములయినను సహింపలేక, పాప
ప్రవృత్తిలో కుందెడీ దేహముతో సంసార సాగర మీాదుట నాకు
సాధ్యము కాదు. మునిపుంగవా ! రామానుజా ! యీ దేహ విసర్జనకు

నాకానతిమ్ము. వేగముగా పరమపదము ప్రసాదింపుము. శ్రీరంగ మందు వసింపదలచితిని. నమ్మాళ్వార్లు, మధుర కలియాళ్వార్లు (నమ్మాళ్వారును తప్ప వేరెవరిని - భగవంతుని గూడ యారాధింపని నైష్ఠికుడు ) మధురవచనములతో నిండిన ద్రవిడవేదము చదివి, పూర్వాచార్య వైభవమును తెలిసికోగంటిని. వేఱుగ్రంధములను చూచుట మానివేసితిని. యతిరాజా ! మీ అభిమానమున్నచాలు. అదే నాకు పరమైశ్వర్యము. స్వాచార్యుని యాదరముతో దేవరవారి శ్రీపాదముల చెంత జేర నిశ్చయించితిని. తిరుమంత్ర ప్రాభవము నర్థము చేసికొన్న నాకు, తల్లియు దండ్రియు దైవము సర్వస్వమైన శ్రీరంగవిభుని గరుడవాహనారూఢుడై నాకు ప్రత్యక్షమగునట్లు - యర్చిరాదిమార్గమున నన్ను కొనిపోవుటకు వీలుగా ఈనికృష్ట దేహమును విసర్జించుదిన మేదో తెలుపుమా ! దేవదేవ ! రామానుజా! బుద్ధిసాగరా !

**10)** **భరన్యాసము :-** (60 వ పద్యము) శ్రీరంగపురమున వసింపుడని యతీంద్రులకు (రామానుజులకు) శ్రీరంగనాథుడు వరమిచ్చెను. మనము కూడ రామానుజుని యాశ్రయించి శ్రీరంగవిభుని వరము పొందినవారము కావలెను. కావున శ్రీమద్రామానుజులయందు భరన్యాసముంచి (శరణాగతి, సర్వభారము నీదే) శ్రీహరి కృపచే విష్ణు పదమునందుకోగలము. ఇది ముమ్మాటికి తథ్యము.

## Source :

1. విశిష్టాద్వైతము - ఆంధ్రానువాదము - డా ॥ అబ్బరాజు సీతారామ చంద్రమూర్తి, రాఘవాంబా ప్రచురణలు, గుంటూరు - 1997.

2. నమ్మాళ్వారు విరచిత కోయిల్ తిరువాయ్ మొళి, 10-9. అర్చిరాది మార్గ వర్ణనము.

3. పీఠికలో నుదహరించినవి.